శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమతే నిగమాంతమహాదేశికాయ నమః

# శ్రీమద్వేంకటనాథగురుస్తోత్రమ్

# శ్రీమద్వేదాంతదేశిక ప్రపత్తి

# శ్రీవేదాంత దేశిక ప్రార్థనాష్టకమ్

# నిగమపరిమళం



శ్రీదేవనాథ పెరుమాళ్, తిరువహీంద్రపురం



'పండితరత్న' డా|| ఉ.వే. శ్రీమాన్ ఈయుణ్ణి అళగ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# విషయ సూచిక

# శ్రీమద్వేంకటనాథగురుస్తోత్రమ్

## విజ్ఞప్తి

శ్రీమన్నిగమంతమహాదేశికులవారి అవతారోత్సవాలు ఆసేతుహిమాచలమే గాక, ప్రపంచమంతా అత్యంత వైభవంగా జరిగే ఈ సందర్భంగా, ఈ స్తోత్రం దేశికభక్తులకు సవినయంగా, ఉపాయనంగా సమర్పింపబడుతున్నది. దీనిని రచించిన మహనీయులు —కాంచీ వాస్తవ్యులు జగదాచార్య సింహాసనాధిపతి, ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్య స్వామివారు. వీరిని గురించి శ్రీవైష్ణవలోకానికి ప్రత్యేకించి పరిచయం చేయవలసిన అవసరం లేదు. గత శతాబ్దిలో జీవించిన వీరు భగవద్రామానుజ సంప్రదాయానికి, సిద్ధాంతానికి చేసిన ఉపకారం ఇంత అని చెప్పడానికి సాధ్యం కానిది. సహస్రాధికంగా కృతులను రచించిన వైభవం వీరిది. వేదంలో, ఉభయ వేదాంతాలలో, ద్రావిడ సంస్కృత భాషలలో నిరుపమానమైన పాండిత్యాన్ని కలిగిన వీరు అసమానమైన కవితా శక్తినికూడా కలవారు. వీరి లేఖినినుండి ఎన్నో మధురమైన కృతులు ఆవిర్భవించాయి. ప్రత్యేకించి, వీరు శ్రీ వరవరమునుల విషయంగా రచించిన స్తోత్రసంపుటి చాలా విలక్షణమైనది. ఆ విధంగానే, శ్రీ దేశికులను ఉద్దేశించి అనుగ్రహించిన ఈ స్తోత్రం చాలా మధురమైనది, ఆశ్చర్యకరమైనది.

వీరికి వేదాంతదేశికుల విషయంలో ఉండే భక్తి ప్రపత్తులను ఈ స్తుతి వ్యక్తం చేస్తున్నది. ఈ స్తోత్రం చిత్రకవిత్వశైలిలో రచింపబడింది. ఈ స్తోత్రంలోని ప్రతి శ్లోకంలో ఉండే మొదటి అక్షరాలను వరుసగా కూడితే ప్రతి దినం అనుసంధింపబడే "శ్రీమాన్ వేంకటనాథార్యః" ఇత్యాది దేశికప్రార్థనా శ్లోకం రూపొందుతుంది. ఇదే కాకుండా, ఈ శ్లోకాలు అన్నిటిలో చివర "మే సన్నిధత్తామ్ హృది" అనేది మకుటం. ఇది, ఈ స్తుతికి మూలమైన శ్లోకంలోని చివరి పాదంకూడా ఈ విధంగానే ఉండడం కూడా ఒక విశేషం. మూల శ్లోకం అనుష్టుభ్ శ్లోకం కనుక, అందులో 32 అక్షరాలు ఉన్నందున, ఆ అక్షరాల సంఖ్యలోనే ఈ స్తుతిలోని శ్లోకసంఖ్య కూడా అమరి ఉండడం ఇంకొక విశేషం. ఇటువంటి

చిత్రకవిత్వాన్ని అల్లడంలో వీరు సిద్ధహస్తులు. ఇప్పుడు, దేశిక మహోత్సవాల సందర్భంగా, ఈ మధురస్తోత్రం తెలుగులో తాత్పర్యంతో ప్రపన్న గోష్ఠికి సమర్పింపబడుతున్నది. స్వస్తి.



శ్రీమాన్ వేంకటనాథార్య ఇతి పద్యాక్షరక్రమాత్ |
శ్రీమద్వేంకటనాథార్యస్తోత్రం వచ్మి సతాం ముదే ||

"శ్రీమాన్ వేంకటనాథార్యః" అనే శ్లోకంలో ఉండే అక్షరాల క్రమంలో ఈ శ్రీవేంకటనాథగురుస్తోత్రం రచింపబడుతున్నది.



# శ్రీమద్వేంకటనాథగురుస్తోత్రమ్

*శ్రీమద్వేంకటనాథదేశికమణిః శేషాద్రిభూషామణేః*
*ఘంటాంశః కుశికాత్మజాన్వయసుధాసింధోః సుధాదీధితిః |*
*శ్రీరామానుజసూరివర్యకరుణాసంప్రాప్తవిద్యోత్కరోఽ*
*నంతార్యాహ్వయసోమసుత్సుతమణిః మే సన్నిధత్తాం హృది || 1 ||*

శ్రీ వేంకటాచలానికి గొప్ప అలంకారంవంటి శ్రీనివాసుని దివ్యాలయంలో ఉండే గంటయొక్క అంశతో అవతరించినవారు, కౌశికగోత్రం అనే పాలసముద్రానికి ఆనందం కలిగించే చంద్రునివంటివారు, తమ మేనమామ అయిన ఆత్రేయ రామానుజాచార్యవారివల్ల పొందిన అన్ని విధాలైన విద్యలను కలవారు, అనంత సోమయాజికి కలిగిన రత్నంవంటి పుత్రులు అయిన, వేంకటనాథులు అనే పేరు కలిగిన వేదాంత దేశికులు అనే దేశికమణి నా హృదయంలో ఎల్లప్పుడూ వేంచేసి ఉండాలి.

ఈ శ్లోకంలో దేశికుల అవతార రహస్యం, వారి వంశనామం, వారి తండ్రి పేరు, గోత్రనామం, వారి నామం, వారి ఆచార్యుల నామం మొదలైన వివరాలు అన్ని సూచింపబడ్డాయి.

*మానాతీతమహాగుణౌఘజలధిః మాయీభకంఠీరవో*
*మాతంగాచలమౌలిమండనమణేః మాన్యో మహాదేశికః |*
*మగ్నాన్ సంసృతిసాగరే మితమతీన్ మాదృగ్జనాన్ రక్షితుం*
*మర్త్యాకార ముపేయివాన్ గురువరో మే సన్నిధత్తాం హృది || 2 ||*

లెక్క కట్టడానికి సాధ్యం కానన్ని గొప్ప గుణాలనే రత్నాలకు సముద్రంవంటి వారు, మాయావాదాన్ని చేసే ప్రతివాదులు అనే ఏనుగులకు భయాన్ని కలిగించే సింహం వంటివారు, హస్తగిరిశిఖరానికి అలంకారంవంటివాడైన వరదరాజస్వామి గౌరవానికి పాత్రమైనవారు, గొప్ప దేశికులు అయిన భగవద్రామానుజులే సంసారమనే సాగరంలో మునిగి ఉండే, అల్పజ్ఞానాన్ని కలిగిన నా వంటివారిని రక్షించడం కోసం

మానవరూపాన్ని పొంది, వేదాంతదేశికులు అయ్యారు. అటువంటి ఆచార్యవర్యులు నా హృదయంలో వేంచేసి ఉండాలి.

ఈ శ్లోకంలో అంతటా "మ" అనే అక్షరం మాటిమాటికి ఉపయోగించబడడం శ్లోకానికి ఒక వైలక్షణ్యాన్ని కలిగిస్తున్నది. ఇది ఒక విధమైన శబ్దాలంకారం.

*వేతండాచలమండనస్య వరదస్యాంఘ్రిం సదా సంశ్రయన్*
*తస్యైవాద్భుత మాభిరూప్య మనిశం చిత్తేఽనుభూయ స్వయమ్ /*
*వైకుంఠేఽపి న మేభిలాష ఇతి యః ప్రోచే మహాదేశికః*
*సోఽయం పండితమండలీపరిబృఢో మే సన్నిధత్తాం హృది // 3 //*

హస్తగిరి శిఖరానికి అలంకారమైన వరదరాజస్వామి చరణాలను ఎల్లప్పుడూ ఆశ్రయించేవారై, ఆ వరదరాజ స్వామి అద్భుత సౌందర్యాన్ని ఎల్లప్పుడూ మనస్సులో భావిస్తూ, "వైకుంఠంలో కూడా నాకు కోరిక లేదు, నేను ఎప్పటికీ ఇక్కడే వరదరాజస్వామిని సేవిస్తూ ఇక్కడే ఉంటాను" అని పలికిన గొప్ప ఆచార్యులు, పండితమండలి శ్రేష్ఠులు అయిన ఈ వేదాంతదేశికులు నా హృదయంలో సదా నిలచి ఉండాలి.

దేశికులు రచించిన వైరాగ్యపంచకంలోని "వైకుంఠవాసేఽపి న మేభిలాషః " అనే సూక్తిలోని అర్థం ఇక్కడ స్మరింపబడింది.

*కల్పాంతే కిల యస్య దేశికమణేః శ్రీసూక్తిరత్నోత్కరాః*
*సర్వేషామపి దేహినాం భవభయోద్విగ్నాత్మనాం ముక్తయే /*
*సోఽయం వేదశిరోగురు ర్యతిపతే స్సిద్ధాంత మత్యద్భుతం*
*భూయోభిః కృతిసంచయై ర్విశదయన్ మే సన్నిధత్తాం హృది // 4 //*

శ్రీ వేదాంతదేశికుల శ్రీసూక్తులు అనే రత్నాల సమూహాలు సంసారభయంచేత ఉద్వేగాన్ని పొందిన జీవులందరికీ ముక్తిని ప్రసాదించగలిగినవి. అటువంటి వేదాంతదేశికులు చాలా అద్భుతమైన భగవద్రామానుజ సిద్ధాంతాన్ని తమ అనేక

విధాలైన, అనేక కృతులలో విశదం చేసేవారై, నా హృదయంలో ఎల్లప్పుడూ నిలచి ఉండాలి.

ఈ శ్లోకంలో "శిరొన్ఱు తూప్పుల్ తిరువేంగడముడైయాన్ " అనే దేశికుల తనియన్ పాశురంలోని భావం అనుసంధింపబడింది.

*టంకాద్యై ర్బహుభిః పురాణగురుభిః ప్రాగేవ దృష్టం తతః*
*పశ్చాత్ శ్రీయుతనాథయామునయతిక్ష్మాభృన్ముఖై ర్వర్ధితమ్ |*
*సిద్ధాంతం గురురాడసౌ బహుతమై స్సద్గ్రంథవృందై ర్నిజైః*
*సంవృద్ధం కలయన్ కలిప్రమథనో మే సన్నిధత్తాం హృది || **5** ||*

పరమ వైదికమైన విశిష్టాద్వైతసిద్ధాంతం టంకగుహదేవాది పలువురు మహనీయులచేత పూర్వమే దర్శింపబడింది. తరువాత, నాథయామున భగవద్రామానుజాదుల చేత వృద్ధి చేయబడింది. అటువంటి ఈ సిద్ధాంతాన్ని వేదాంత దేశికులు అనే ఈ గురువరులు తాము రచించిన పలు గ్రంథాలలో పెంపొందిస్తూ, కలిదోషాన్ని పోగొడుతున్నారు. ఆ మహనీయులు నా హృదయంలో ఎల్లప్పుడూ నిలచి ఉండాలి.

ఈ శ్లోకం "నాథోపజ్ఞం ప్రవృత్తమ్" అనే దేశికుల శ్లోకాన్ని అనుసరిస్తూ రచింపబడింది.

*నాహం బోద్ధుమలం భవామి నిగమాంతార్యస్య దివ్యోక్తిషు*
*ప్రాజ్ఞైకానుభవార్హ మద్భుతతమం దివ్యార్థసారం స్వయమ్ |*
*కారుణ్యేన సుదుర్వచేన భరిత స్సోఽయం మహాదేశికః*
*సర్వార్థాన్ స్వయమేవ సాధు గమయన్ మే సన్నిధత్తాం హృది || **6** ||*

దేశికుల దివ్య సూక్తులలోని, పండితులకు మాత్రమే అనుభవించడానికి వీలైన, చాలా అద్భుతమైన దివ్యమైన అర్థాల సారాన్ని తెలియడానికి నేను సమర్థుడను కాను. అందుచేత అంతు లేని కరుణను కలిగిన ఈ మహాచార్యులు ఆ అర్థాలను అన్నిటినీ స్వయంగానే చక్కగా నాకు తెలియజేస్తూ, నా హృదయంలో నిలచి ఉండాలి.

*థాస స్సే - ఢకి లోప - ఋత్యక - ఇకో యణ్ - కుత్సితే - డస్సి ధుట్*
*ఝర్ల స్ - ఝూజంత ఇతీదృశాని సతతం సూత్రాణి సంక్రందతామ్ /*
*శ్రేయః కించన నోదియాదితి ధియా సూక్తీ స్సుహృద్యా అదాత్*
*యో వేదాంతమహాగురు స్స కృపయా మే సన్నిధత్తాం హృది // 7 //*

"ఋత్యకః", "ఇకో యణచి" మొదలైన వ్యాకరణ సూత్రాలను సదా పఠించేవారికి ఏ విధమైన శ్రేయస్సు కలుగదు– అనే భావంతో చాలా హృద్యమైన సూక్తులను వేదాంతదేశికులు మనకు అనుగ్రహించారు. అటువంటి మహానుభావులైన ఆ గొప్ప ఆచార్యులు కృపతో నా హృదయంలో ఎల్లప్పుడూ నిలచి ఉండాలి.

*యః కారుణ్యనిధి ర్యమాహ భగవాన్ వేదాంతసద్దేశికం*
*యేనేదం భువనం సనాథ మభవత్ యస్మై నతిః శ్రేయసీ ।*
*యస్మాద్దివ్యసుధోదయ స్సమభవత్ యస్య ప్రభావోఽద్భుతః*
*యస్మిన్ సర్వగుణా బభుః స గురురాణ్మే సన్నిధత్తాం హృది // **8** //*

కరణకు నిధి అయిన ఏ మహనీయులకు శ్రీరంగనాథుడు వేదాంతదేశికులు అనే బిరుదాన్ని ఇచ్చాడో, ఎవరి వల్ల ఈ లోకం అంతా నాథుని కలిగినది అయినదో, ఎవరికి నమస్కరిస్తే మనకు శ్రేయస్సు కలుగుతుందో, ఎవరి వల్ల దివ్యమైన సూక్తులు అనే అమృతం ఉదయించిందో, ఎవరి ప్రభావం అద్భుతమైనదో, ఎవరిలో అన్ని గుణాలు ప్రకాశిస్తున్నాయో, ఇటువంటి గురురాణ్మణి నా హృదయంలో ఎల్లప్పుడూ వేంచేసి ఉండాలి.

ఈ శ్లోకంలో ప్రథమా విభక్తి మొదలుకొని అన్ని విభక్తులలోనూ యచ్ఛబ్దప్రయోగం చేయబడింది. ముకుంద మాలా స్తోత్రంలోని "విష్ణో రక్షతు నో" అనే శ్లోకం శైలిలో ఇది రచింపబడింది.

*కన్యామాసి ఫణీంద్రశైలశిఖరాలంకారతీర్థోడుని*
*ప్రాదుర్భూయ భవాబ్ధిమగ్న జనతాసంరక్షణైకవ్రతీ /*
*యః ప్రోవాచ శతాధికాన్ సుమధురాన్ సారార్థరత్నాకరాన్*
*సద్గ్రంథాన్ స గురు ర్గుణామృతనిధి ర్మే సన్నిధత్తాం హృది // 9 //*

కన్యామాసంలో శేషశైలశిఖరానికి అలంకారమైన శ్రీవేంకటేశ్వరునితీర్థ దివసంనాడు అవతరించి, సంసారంలో మునిగిన జనులను సంరక్షించడం అనే అద్వితీయమైన వ్రతాన్ని కలిగిన వేదాంతదేశికులు నూటికి మించిన సంఖ్యలో చాలా మధురమైన, సారార్థాలకు సముద్రంవంటి గొప్ప గ్రంథాలను అనుగ్రహించారు. కల్యాణ గుణాలకు నిధి అయిన ఆ ఆచార్యవర్యులు నా హృదయంలో ఎల్లప్పుడూ నిలిచి ఉండాలి.

*విశ్వత్రాణవిచక్షణ స్స భగవాన్ ఘంటాం స్వకీయాం శుభాం*
*తోతాద్ర్యాహ్వయదివ్యయోషిదుదరే న్యస్యన్ సమా ద్వాదశ /*
*ప్రాదుర్భావ్య యదాత్మనా విభవనామ్న్యబ్దే నభస్యే నిజే*
*నక్షత్రే జగతీం రరక్ష స గురు ర్మే సన్నిధత్తాం హృది // 10 //*

లోకాలను రక్షించడంలో సమర్థుడైన ఆ భగవంతుడు మంగళకరమైన తన ఆలయంలోని గంటయొక్క అంశను తోతాద్ర్యంబ గర్భంలో ప్రవేశపెట్టి, 12 నెలల తర్వాత విభవ సంవత్సరంలో, ఆశ్వయుజ మాసంలో, తన నక్షత్రమైన శ్రవణానక్షత్రంలో వేదాంత దేశికుల రూపంలో ఆవిర్భవింప జేసి, లోకాన్ని రక్షించాడు. అటువంటి వేదాంతదేశికులు అనే ఆ ఆచార్యులు ఎల్లప్పుడూ నా హృదయంలో నిలచి ఉండాలి.

వేదాంతదేశికులు శ్రీ వేంకటేశ్వరుని ఆలయంలో గంట యొక్క అంశతో అవతరించారు —అనే సాంప్రదాయకమైన విషయం ఇందులో ప్రస్తావించబడింది.

*తాతో మే భువనప్రసిద్ధమహిమా విద్యానిషద్యాత్మకో*
*యస్య శ్రీనిగమాంతదేశికమణేః శ్రీసూక్తిరత్నావలీః /*
*ఆబాల్యాన్మమ కంఠభూషణతయా విన్యాస్థత్ అన్యాదృశః*
*సోఽయం దేశిక ఆత్మనః కరుణయా మే సన్నిధత్తాం హృది // 11 //*

దాసుని పితృపాదులు లోకంలో ప్రసిద్ధి చెందిన మహిమను కలవారు. విద్యకు ఆపణంవంటివారు. వారు చాలా అనుగ్రహంతో నా చిన్నతనం నుండి వేదాంతదేశకుల రత్నాలవంటి శ్రీ సూక్తులు నాకు కంఠస్థం అయ్యేటట్లు చేశారు. అటువంటి ఆ వేదాంతదేశికులు ఎల్లప్పుడూ నా హృదయంలో నిలచి ఉండాలి.

*కించిత్ జ్ఞాన ముపేయుషామపి సతాం యస్య త్రయీశేఖరా -*
*చార్యస్యాద్భుతసూక్తిబృంద మనఘం హృద్యం హి విద్యోతతే /*
*భక్తిం భూరితమాం విరక్తి మనఘాం విజ్ఞాన ముచ్చావచం*
*బిభ్రాణ స్స మహాగురు ర్గుణనిధి ర్మే సన్నిధత్తాం హృది / **12** //*

కొంచెం జ్ఞానం కలిగినవారైన సత్పురుషులకు కూడా శ్రీదేశికుల, అద్భుతమైన, ఏ దోషం లేని శ్రీ సూక్తి సమూహం చాలా హృద్యంగా భాసిస్తుంది. గొప్ప భక్తిని, ఏ దోషం లేని విరక్తిని, అంతు లేని విజ్ఞానాన్ని కలిగిన, గుణాలకు నిధి అయిన ఆ మహాచార్యులు నా హృదయంలో ఎల్లప్పుడూ నిలచి ఉండాలి.

*కల్లోలా ఇవ సాగరే గురువరే యస్మిన్ సదా సూక్తయః*
*ప్రాదుర్భావ మనర్గలం జనిజుషాం సౌభాగ్యభూమ్నా దధుః /*
*సోఽయం సర్వకలావిహారనిలయః సర్వజ్ఞచూడామణిః*
*సర్వానందనసద్గుణాఘుజలధి ర్మే సన్నిధత్తాం హృది//**13**//*

సంసారుల అదృష్టవశంచేత వేదాంతదేశికులు అనే గొప్ప ఆచార్యులలో ఎల్లప్పుడూ శ్రీసూక్తులు, సముద్రంలో తరంగాల వలె, ఆవిర్భవించాయి. అటువంటి, అన్ని కళలకు విహరణ భూమి అయిన, సర్వజ్ఞ చూడామణి అయిన, అందరినీ ఆనందింప చేసే సద్గుణాలతో సముద్రంవంటివారైన ఈ వేదాంతదేశికులు నా హృదయంలో నిలచి ఉండాలి.

*కే వా సంతి మహీతలే ఽత్ర విపులే వేదాంతసూరేః గిరః*
*సర్వా స్సాధు విమృశ్య తస్య హృదయం గాఢం గ్రహీతుం క్షమాః /*
*సోఽయం దేశికసార్వభౌమ ఇహ మామేకం కృపావైభవాత్*
*స్వీయాంతఃకరణజ్ఞ మాశు కలయన్ మే సన్నిధత్తాః హృది//**14***

విశాలమైన ఈ ప్రపంచంలో వేదాంతదేశికుల శ్రీ సూక్తులను చక్కగా విమర్శించి, వాటి హృదయాన్ని గాఢంగా లోతుగా గ్రహించగలిగిన సమర్థులు ఎవరున్నారు? అటువంటి ఈ దేశికసార్వభౌములు నన్ను ఒక్కడను తమ కృపా వైభవంతో తమ హృదయాన్ని చక్కగా వేగంగా తెలిసి కొన్నవాడనుగా నన్ను చేస్తూ, నా హృదయంలో ఎల్లప్పుడూ నిలచి ఉండాలి.

*సత్యం సత్య మహం బ్రవీమి భువనే నాన్యోఽవతీర్ణో గురుః*
*చారిత్రం పరమం పవిత్ర మతులా సూక్తీశ్చ సందర్శయన్ /*
*ఏకోఽయం శ్రుతిమౌలిదేశికమణిః సర్వాత్మనా శోభనః*
*సోఽయం సీమదరిద్రయా కరుణయా మే సన్నిధత్తాం హృది // **15** //*

నిజం! నిజాన్ని పలుకుతున్నాను. ఈ లోకంలో వేదాంతదేశికుల వంటి ఆచార్యులు ఇంకొకరు అవతరించలేదు. తమ పరమపవిత్రమైన చరిత్రను, సూక్తులను సందర్శింప చేస్తూ, సర్వాత్మనా మంగళకరులైన ఈ ఆచార్యులు అంతు లేని కరుణతో ఆ హృదయంలో నిలచి ఉండాలి.

*రీంకారం కలయంతి శీధుకణికాం పీత్వా ద్విరేఫా వనే*
*సోఽహం వేదశిరోగురో ర్థి ఫణితీః పీయూషకల్పా ముహుః /*
*పాయంపాయ మనర్గలం విరచయే తౌర్యత్రికం చత్వరే*
*సోఽయం సర్వకలానిధి ర్గురువరో మే సన్నిధత్తాం హృది // **16** //*

వనంలో మకరంద కణాలను తుమ్మెదలు పానం చేసి ఝుంకారాన్ని చేస్తాయి. నేనైతె, వేదాంతదేశికుల అమృతంవంటి సూక్తులను మాటిమాటికి అడ్డు లేకుండా పానం

చేసి, నాలుగు వీథుల కూడలిలో తౌర్యత్రికాన్ని చేస్తాను. అటువంటి సర్వకళానిధి అయిన గురువరులు నా హృదయంలో ఎల్లప్పుడూ నిలచి ఉండాలి.
తౌర్యత్రికం అంటే –గానం, నాట్యం, అభినయం అనే ఈ మూడిటి కలయిక.

*వేదానాం పఠనం పురాణకథనం స్మృత్యాదిసంశీలనం*
*సర్వం యస్య గురో ర్గిరాం పరిచయైః పుష్ణాతి శోభాం పరామ్ |*
*సోఽయం సర్వపథీనధీవిలసితో వైరాగ్యవారాన్నిధిః*
*శ్రీమాన్ వేదశిరోగురుః ప్రతికలం మే సన్నిధత్తాం హృది || 17 ||*

వేదాల అధ్యయనం, పురాణాల కథనం, స్మృతులు మొదలైనవాని పరిశీలనం అనే ఇవి అన్ని వేదాంతదేశికుల శ్రీ సూక్తుల పరిచయం ఉన్నప్పుడే ప్రకాశాన్ని పొందుతున్నాయి. అటువంటి, అన్ని విధాలైన బుద్ధివిశేషాలతో వెలసినవారు, వైరాగ్యానికి సముద్రంవంటివారు, జ్ఞానసంపదను కలిగినవారు అయిన వేదాంతదేశికులు ప్రతిక్షణం నా హృదయంలో నిలచి ఉండాలి.

*దాంతి శ్శాంతిరితి ద్వయం హి సకలై స్సంపాదనీయో నిధిః*
*సఽయం యస్య బభౌ స్వభావనియతో లక్ష్మీశసంకల్పతః |*
*వాజిగ్రీవకృపాకటాక్షవిభవోదంచత్ప్రభావోజ్జ్వలః*
*సోఽయం దేశికతల్లజః స్వకృపయా మే సన్నిధత్తాం హృది || 18 ||*

బాహ్యేంద్రియాల నిగ్రహం, ఆంతర ఇంద్రియాల నిగ్రహం– అనే ఈ రెండు అందరిచేత సంపాదించదగిన గొప్ప నిధివంటివి. భగవంతుని సంకల్పవశంచేత ఈ రెండు వేదాంతదేశికులలో గొప్పగా ప్రకాశించాయి. హయగ్రీవ స్వామి కృపాకటాక్ష వైభవంచేత గొప్ప పాండిత్యప్రభావాన్ని, కవితావైభవాన్ని కలిగినవారు వేదాంత దేశికులు. అటువంటి ఈ గొప్ప ఆచార్యులు తమ కృపతో నా హృదయంలో నిలచి ఉండాలి.

*తాతోఽయం తనయోఽయమేష సహజ స్స్నేషా ప్రసూః పత్న్యసౌ*
*క్షేత్రం మామక మేతదిత్యనవధి ప్రోజ్జృంభమాణా తృషా /*
*సర్వా మే సముభూద్యదీయఫణితిష్వేవ ప్రసిద్ధప్రథః -*
*సోఽయం నిస్తులవైభవో గురువరో మే సన్నిధత్తాం హృది // 19 //*

"ఈయన నా తండ్రి, ఇతడు నా కుమారుడు, ఇతడు నా సోదరుడు, ఏమైనా కుమార్, ఈమె నా భార్య, ఇది నా క్షేత్రం" —అని ఈ విధంగా నిరవధికంగా విజృంభించి పెరిగే కోరిక అంతా కూడా నాకు వేదాంతదేశికుల సూక్తులలోనే ఏర్పడింది. అటువంటి, ప్రసిద్ధకీర్తిని, సాటి లేని వైభవాన్ని కల ఈ ఆచార్యవర్యులు నా హృదయం ఎల్లప్పుడు నిలచి ఉండాలి.

"మాతా పితా యువతయః" అనే శ్లోకంలోని అర్థం ఇక్కడ దేశికుల సూక్తుల విషయంగా అనుసంధింపబడింది.

*చార్వాకాదిమదుర్మతాంధతమసధ్వంసార్థ ముద్యన్ రవిః*
*శ్రీమద్వైష్ణవమండలీకువలయోల్లాసాయ భాస్వాన్ విధుః /*
*సోఽయం వేదశిరోగురు స్స భగవానిత్యేవ మత్యాదరాత్*
*సద్భి స్సాధుగణైః ప్రశస్యమహిమా మే సన్నిధత్తాం హృది // 20 //*

షాడ్గుణ్య పరిపూర్ణులైన వేదాంతదేశికులు చార్వాకమతం మొదలైన తగని మతాలు అనే గాఢమైన చీకటిని పోగొట్టడంలో సూర్యుడు. ఆ విధంగానే, శ్రీమద్వైష్ణవసమూహం అనే కలువలను ఆనందింప చేయడంలో గొప్ప కాంతిని కల చంద్రుడు— అని చాలా ఆదరంతో దేశికులను సత్పురుషుల సమూహం అంతా పొగడుతున్నది. ఇటువంటి, కీర్తించదగిన మహిమ కలిగిన వేదాంతదేశికులు నా హృదయంలో ఎల్లప్పుడూ నిలచి ఉండాలి.

*యజ్ఞే ధాతురుదిత్వర స్స వరదః శ్రీహస్తిశైలేశ్వరః*
*స్వీయే వాహనమండపే పరమయా ప్రీత్యా య మాస్థాపయన్ /*
*వారంవార మనుగ్రహం ప్రకటయన్ విద్యోతతే తాదృశ*
*ప్రఖ్యాతామితవైభవో గురువరో మే సన్నిధత్తాం హృది // 21 //*

బ్రహ్మ చేసిన యజ్ఞంలో వరదరాజస్వామి ఆవిర్భవించాడు. అటువంటి ఆ స్వామి చాలా ప్రీతితో వేదాంతదేశికులను తన వాహన మండపంలో వేంచేసి ఉండేటట్లు చేసి, మాటిమాటికి వారి విషయంలో తనకు కల అనుగ్రహాన్ని ప్రదర్శించాడు. అటువంటి, ప్రసిద్ధమైన, అంతు లేని వైభవాన్ని కలిగిన ఆచార్యవర్యులు నా హృదయంలో ఎల్లప్పుడూ నిలచి ఉండాలి.

*వర్గే వైష్ణవశుద్ధసంతతిజుషాం శ్లాఘ్యాన్ అథాన్యైరపి*
*ప్రాజ్ఞై ర్భూరితమైః ప్రశస్యవిభవాన్ గ్రంథాన్ గరిష్ఠాన్ బహూన్ /*
*శ్రీమద్వాజిముఖస్య దివ్యకృపయా నిత్యం సృజన్ నిర్మల -*
*ప్రజ్ఞో దేశిక ఏష దోషవిధురో మే సన్నిధత్తాం హృది // 22 //*

శ్రీవైష్ణవుల శుద్ధమైన వంశంలో జన్మించిన మహనీయులచే, ఆ విధంగానే మిగిలిన చాలా మంది ప్రాజ్ఞులచే కూడా పొగడదగిన వైభవాన్ని కలిగిన గొప్ప గొప్ప గ్రంథాలను ఈ వేదాంతదేశికులు శ్రీ హయగ్రీవ స్వామి దివ్యకృపచేత నిత్యం రచించారు. అటువంటి, ఏ దోషం లేని ప్రజ్ఞను కలిగిన, హేయప్రతిభటులైన వేదాంతదేశికులు నా హృదయంలో నిలచి ఉండాలి.

*యోగ్యానా మయమగ్రగణ్య ఇతి భువ్యాఖ్యామిహాప్సు ర్జనః*
*యస్యాచార్యమణే ర్వ్యశుద్ధపణితిష్వత్యాదరం ప్రాప్సు యాత్ /*
*సోఽయం శ్రీశతదూషణీముఖమహాగ్రంథావలిఖ్యాపిత -*
*ప్రజ్ఞాశేవధి రాదరేణ మహతా మే సన్నిధత్తాం హృది // 23//*

"యోగ్యులలో ఇతడు అగ్రగణ్యుడు" అనే పేరును లోకంలో పొందాలని కోరేవాడు వేదాంతదేశికుల విశుద్ధమైన సూక్తులలో ఆదరాన్ని కలిగి ఉండాలి. ఈ వేదాంతదేశికులు గొప్ప ప్రజ్ఞ వారు రచించిన శతదూషణి మొదలైన మహాగ్రంథాలద్వారా వ్యక్తమవుతున్నది. అటువంటి ఈ ఆచార్యులు ఆదరంతో నా హృదయంలో సదా నిలచి ఉండాలి.

*మేదిన్యా మిహ సర్వతః ప్రసృమరా విఖ్యాతి రన్యాదృశీ*
*యస్య శ్రీనిగమాంతదేశికమణే ర్నిత్యం సముజ్జృంభతే |*
*యస్యాహు స్సకలేఽపి తంత్రనిచయే స్వాతంత్ర్య మత్యంకుశం*
*శ్రీమానేష గుణాలయో గురువరో మే సన్నిధత్తాం హృది // 24 //*

ఈ లోకంలో అంతట సాటి లేని, వేదాంతదేశికుల కీర్తి అంతటా వ్యాపించే స్వభావాన్ని కలిగినదై, నిత్యం వృద్ధి పొందుతున్నది. వారికి అన్ని విధాలయిన తంత్రాలలో అడ్డులేని స్వాతంత్ర్యం ఉన్నది. అందువల్ల వారికి సర్వతంత్ర స్వతంత్రులు అనే పేరు వచ్చింది. అటువంటి, గొప్ప శోభను కలిగిన, గుణాలకు ఆలయమైన ఈ ఆచార్యవర్యులు నా హృదయంలో ఎల్లప్పుడూ నిలచి ఉండాలి.

*సందేహాన్ సకలాన్ హతాన్ విదధతః పీయూషసందేహదాన్*
*గంగాపూరసధర్మిణ శ్శుభతమాన్ దివ్యా న్నిబంధాన్ బహూన్ |*
*ఉద్ఘాట్య క్షితిమండలం నిరుపమం నిష్కల్మషం చాదధత్*
*వేదాంతార్యగురూత్తమః కరుణయా మే సన్నిధత్తాం హృది // 25 //*

"ఇవి అమృతమా!" అనే సందేహాన్ని కలిగించేవి, గంగానదీ ప్రవాహాలతో సమానమైనవి, మిక్కిలి శుభకరమైనవి అయిన దివ్యమైన పలు ప్రబంధాలతో సందేహాలను పటాపంచలు చేస్తూ, ఈ భూమండలాన్ని అంతటిని సాటి లేని రీతిలో ఏ

దోషం లేకుండా చేస్తూ ఉండే వేదాంతదేశికులనే గొప్ప ఆచార్యులు కరుణతో నా హృదయంలో నిలచి ఉండాలి.

*నిత్యారాధనపేటికాం మమ గృహే ధన్యాం వితన్వన్ చిరాత్*
*సర్వాసామపి సంపదాం మమ కులే బీజాయమానో మహాన్ |*
*జ్ఞానానుష్ఠితిసంపదా సుమహితః కంఠీరవో వాదినాం*
*త్రయ్యంతార్యమహాగురు శ్శుభమతిర్మే సన్నిధత్తాం హృది || 26 ||*

దాసుని గృహంలో ఉండే తిరువారాధన వేటిక మా కులంలోని సకల సంపదలకు బీజభూతమైనది. అటువంటి ఆరాధన పేటికను వేదాంతదేశికుల అర్చామూర్తి ధన్యతను పొందిస్తూ, అందుల వేంచేసి ఉన్నారు. జ్ఞానం, అనుష్ఠానం అనే సంపదలతో గొప్పతనాన్ని కలిగినవారు, కవితార్కిక సింహులు, మంగళకరమైన బుద్ధిని కలవారైన వేదాంతదేశికులనే ఆచార్యులు నా హృదయాన్ని ఆదివసించి ఉండాలి.

*ధన్యో నాన్య ఇహాస్తి కేవల మహం ధన్యాగ్రణీ రిత్యముం*
*గర్వం నిర్వహతి ప్రసిద్ధమహిమా యో దేశికో మామకమ్ |*
*సోఽయం ధన్యతమాం ధరాం విదధతీ సూక్తీ రమేయా స్సృజన్*
*శ్రీమాన్ వేదశిరోగురు ర్ముదజుషో మే సన్నిధత్తాం హృది || 27 ||*

ప్రసిద్ధమైన మహిమ కలిగిన వేదాంతదేశికులు తమ అనుగ్రహం ద్వారా "నాకంటే ధన్యులు ఇంకొకరు లేరు, నేనే అందరి కంటే ధన్యుడను" అనే సాత్వికమైన గర్వాన్ని, ప్రసిద్ధమైన మహిమ కలిగిన వేదాంతదేశికులు తమ అనుగ్రహం ద్వారా నాకు కలిగిస్తున్నారు. వీరు సాటిలేని సూక్తులను అనుగ్రహిస్తూ, లోకాన్ని అంతటిని ధన్యతను పొందిస్తున్నారు అటువంటి వైభవాన్ని కలిగిన వేదాంతదేశికులు సంతోషంతో నా మనసులో నెలకొని ఉండాలి.

*తామ్యద్భి ర్బహుధా జనైః పరివృతే భూమండలేఽస్మిన్నహం*
*యస్యానుగ్రహపాత్రతా మనితరప్రాప్యా మిహ ప్రాప్నువన్ /*
*సంతుష్ట స్సతతం ప్రఫుల్లహృదయో దుఃఖోక్తివైదేశికో*
*వర్తేః సోఽయ మమేయధీ ర్గురువరో మే సన్నిధత్తాం హృది // **28** //*

అనేక విధాలుగా సోమరిపోతులతో నిండిన ఈ ప్రపంచంలో నేను సాటి లేని వేదాంతదేశికుల అనుగ్రహానికి పాత్రుడనై, ఎల్లప్పుడూ సంతోషాన్ని పొందినవాడనై, వికసించిన హృదయంతో దుఃఖానికి దూరమై ఉండగలను. అటువంటి, సాటి లేని బుద్ధిని కలిగిన, ఆచార్యవర్యులైన వేదాంతదేశికులు నా హృదయంలో సదా నెలకొని ఉండాలి.

*సద్బృందై స్సహ నిత్యవాసరసికం సంఖ్యాతిగై ర్భావుకైః*
*సంశ్రావ్యోక్తిపరంపరాం చ కృపయా యో మాం వ్యధాద్దేశికః /*
*సోఽయం ద్రావిడసంస్కృతాదిసకలభాషాసు కూలంకష -*
*ప్రజ్ఞో వేదశిరోగురు ర్మధురవాక్ మే సన్నిధత్తాం హృది // **29** //*

సంఖ్యకు మించిన భావుకులైన సత్పురుషుల బృందాలతో నిత్యం నివసించే భాగ్యాన్ని, వారితో మధురమైన మాటలను సంభాషించే అదృష్టాన్ని కృపతో వేదాంతదేశికులు నాకు అనుగ్రహించారు. అటువంటి ఈ వేదాంతదేశికులు ద్రావిడ సంస్కృతాది సకల భాషలలో కూలంకషమైన ప్రజ్ఞను కలవారు. మధురమైన వాక్కునను కలవారు. వారు నా హృదయంలో నెలకొని ఉండాలి.

*దారిద్ర్యం క్షపయన్ యశో విశదయన్ విజ్ఞాన ముజ్జృంభయన్*
*ఆచారం పరిపోషయన్ శుభమతిం సర్వత్ర సంవర్ధయన్ /*
*భక్తిం మేదురయన్ హరౌ కిమధికైః సర్వాన్ గుణాన్ జృంభయన్*
*శ్రీమద్వేదశిరోగురు ర్మహితవాక్ మే సన్నిధత్తాం హృది // **30** //*

బీదరికాన్ని పోగోడుతూ, కీర్తిని వ్యాపింప చేస్తూ, విజ్ఞానాన్ని పెంపొందిస్తూ, ఆచారాన్ని చక్కగా పోషిస్తూ, మంగళకరమైన బుద్ధిని అంతట వర్ధిల్ల చేస్తూ, భగవంతునిలో భక్తిని గాఢంగా బలపడేటట్లు చేస్తూ, ఇంత ఎందుకు?, అన్ని గుణాలను వృద్ధి చేస్తూ, గొప్ప వాక్కును కల దేశికులు నా హృదయంలో నెలకొని ఉండాలి.

*హృద్యై ర్నిత్యమవద్యగంధవిధురై రుచ్చావచై ర్మామక -*
*గ్రంథై ర్భూమి మిమాం సదా సురభయన్ వేదాంతసూరి ర్గురుః /*
*పూర్వాచార్యసదుక్తిరత్నసతతాస్వాదైకసక్తాశయం*
*కుర్వ న్మాం కమనీయదివ్యవపుషా మే సన్నిధత్తాం హృది // **31** //*

నిత్యం మనోహరాలైన, ఏ దోషం లేని, అనేకవిధాలైన నా గ్రంథాలతో ఈ భూమిని అంతటిని పరిమళింపజేస్తూ, నన్ను పూర్వాచార్యుల సూక్తిరత్నాలను ఆస్వాదించడంలో ఎల్లప్పుడు ఆసక్తిని కలవాడనుగా చేస్తూ, వేదాంతదేశికులనే ఆచార్యులు హృదయంలో నెలకొని ఉండాలి.

*దివ్యాకారజితస్మరః సుకవితాచాతుర్యలీలాగృహం*
*శుద్ధానుష్ఠితికేలిసద్మ భగవద్భక్త్యాకరోఽత్యద్భుతః /*
*సందిగ్ధార్థవినిర్ణయేషు చతుర స్సర్వార్థసిద్ధ్యాదికా -*
*నేకగ్రంథకృదేష దేశికమణిర్మే సన్నిధత్తాం హృది // **32** //*

దివ్యమైన ఆకారంలో మన్మథుని జయించినవారు, సుకవితాచాతుర్యానికి విలాసగృహం, శుద్ధమైన అనుష్ఠానానికి విహారగృహం, భగవద్భక్తికి అత్యద్భుతమైన భగవద్భక్తికి ఆకరం, సందేహం కల విషయాలను నిర్ణయం చేయడంలో సమర్థులు, సర్వార్థసిద్ధి మొదలైన అనేకగ్రంథాలను రచించిన దేశికమణి నా హృదయంలో నెలకొని ఉండాలి.

*ఇత్థం వాదిభయంకరవంశేయాణ్ణంగరార్యసంకలితమ్ /*
*శ్రీమద్వేంకటనాథస్తోత్రం పఠతాం సమృద్ధి రఖిలా స్యాత్ //*

ఈ విధంగా ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యులచే రచింపబడిన ఈ శ్రీవేంకటనాథగురుస్తోత్రాన్ని పఠించినవారికి అన్ని సమృద్ధులు కలుగుతాయి.

ఇతి శ్రీమద్వేంకటనాథగురుస్తోత్రం సమాప్తమ్

★★★★★★

# శ్రీమద్వేదాంతదేశిక ప్రపత్తి

## విజ్ఞప్తి

ఈ స్తోత్రాన్ని శ్రీదేశికుల కుమారులైన కుమార వరదాచార్యస్వామి వారు అనుగ్రహించారు. తమకు తండ్రియే కాక, బ్రహ్మోపదేష్ట కూడా అయిన దేశికుల విషయంగా వీరు రచించిన పలు స్తోత్రాలలో ఇది విలక్షణమైనది. శబ్దాలంకారాలతో, అర్థాలంకారాలతో విరాజిల్లే ఈ స్తోత్రం నిత్యం అనుసంధించదగినది, పెద్దలచే అనుసంధింపబడేది కూడా. ఈ స్తోత్రాన్ని చూడగానే మనకు కనిపించే, మనసును ఆకట్టుకునే అంశం ఏమంటే– ఇందులోని ప్రతిశ్లోకంలోని ప్రతిపాదం "వి" అనే అక్షరంతో రచింపబడడం. ఇది ఒక అసాధారణమైన అందాన్ని ఈ స్తోత్రానికి కలిగిస్తున్నది. పలు విధాలైన రమణీయమైన భావాలు చరమపర్వాత్మకంగా ఇందులో అనుసంధింపబడ్డాయి.

ప్రపత్తి, శరణాగతి, న్యాసం అనే ఈ పదాలు అన్ని ఒకే అర్థాన్ని తెలియజేస్తాయి. తన రక్షణ భారాన్ని తాను నమ్మిన వ్యక్తి సమక్షంలో సమర్పించే ప్రక్రియయే ఇది. దీనిని ఉత్తమమైన ఉపాయంగా వేదం కూడా "తస్మాత్ న్యాసమేషాం తపసా మతిరిక్తమాహుః" అని అంటూ తెలిపింది.

భగవంతుని శ్రీ చరణాలలో శరణాగతి చేసే విధానాన్ని మనకు ద్వయ మంత్రంలోని పూర్వ వాక్యం తెలుపుతున్నది. ఇది ప్రథమ పర్వాత్మకం. ఈ ఉపాయాన్ని స్వాచార్యుల విషయంలో అనుష్ఠించడం చరమ పర్వాత్మకం. అటువంటి ప్రక్రియను కుమార వరదాచార్య స్వామి వారు తమకు ఆచార్యులైన దేశికుల సన్నిధిలో ఆచరించి, మనకు మార్గదర్శకులు అయ్యారు. ఆనాడు మన అందరి కోసం ప్రతి వాది భయంకరమ్ అణ్ణన్ అనే మహనీయులు శ్రీ వేంకటేశ్వరుని శ్రీ చరణాలలో శరణాగతిని చేసినట్లే, కుమార వరదాచార్య స్వామి వారు కూడా మన అందరి కోసం దేశికుల

శ్రీచరణాలలో ఈ ప్రపత్తి స్తోత్రం ద్వారా శరణాగతిని చేస్తున్నారు. వారికి ఉన్నంత భక్తి, విశ్వాసం, ఆర్తి మొదలైనవి మనకు లేకపోయినా, దీనిని మనం అనుసంధిస్తే, ఈ స్తుతిని అనుగ్రహించిన వరదాచార్య స్వామి వారిని చూచి అయినా దేశికులు మనలను తప్పక కటాక్షిస్తారు. అందులో సందేహం లేదు. అందుచేత ఇది నిత్యం అర్థానుసంధాన పూర్వకంగా అనుసంధించదగిన స్తోత్రం. ఈ శ్లోకాలలోని తాత్పర్యం సంగ్రహంగా సహృదయపాఠకుల సన్నిధిలో నివేదింపబడుతున్నది.



# శ్రీమద్వేదాంతదేశిక ప్రపత్తి

*1) విద్వన్మతంగజశిఖాభరణాయమానౌ*
*విశ్వాతిశాయిమహిమాంబునిదానభూతౌ*
*విద్వేషవాదిముకుటీకృతకుట్టనౌ తౌ*
*వేదాంతసూరిచరణౌ శరణం ప్రపద్యే.*

వేదాంతదేశికుల శ్రీ చరణాలు పండితోత్తముల శిరస్సులకు ఆభరణాలు, అంటే, పండితులు అందరూ వారి శ్రీచరణాలను శిరసావహిస్తారు ఆనాడు విష్ణుపాదం నుండి గొప్ప మహిమ కలిగిన గంగ పుట్టినది. ఆ విధంగానే ఇప్పుడు అంతు లేని మహిమ అనే పవిత్ర జలం ఈ దేశికుల శ్రీ చరణాలనుండి పుట్టినది. గంగానది ఏ విధంగా అందరినీ పావనం చేస్తుందో, ఆ విధంగానే దేశికుల శ్రీచరణాలు అందరినీ పరమపావనం చేస్తాయి. భగవద్రామానుజ సిద్ధాంతాన్ని ద్వేషిస్తూ వాదించేవారి కరీటాలపై ఈ పాదాలు తాడనం చేస్తాయి. అంటే, వారికి పరాజయాన్ని కలిగిస్తాయి. ఇటువంటి శ్రీ వేదాంతదేశికుల రెండు శ్రీచరణాలను నేను ఆశ్రయిస్తున్నాను.

*2)విశ్వంభరా మతితరామపి భావయంతౌ*
*విన్యాసతోవివిధసజ్జనతానుభావ్యౌ,*
*విస్తారసంసృతిమహార్ణవకర్ణధారౌ*
*వేదాంతసూరిచరణౌ శరణం ప్రపద్యే.*

ఈ సమస్త విశ్వం యొక్క రక్షణ భారం ఎంతో గొప్పది అయినప్పటికీ, దానిని వేదాంతదేశికుల పాదాలు చక్కగా భావన చేస్తూ, దానిని నిర్వహిస్తున్నాయి. తమ అందమైన విన్యాసాలతో పలువురు సజ్జనుల మనసులను ఆకర్షిస్తున్నాయి, అంటే, వేదాంత దేశికులు అనుగ్రహించిన పలు గ్రంథథాలలోని పలు పద ప్రయోగాల విన్యాసాలు విద్వాంసులైన సజ్జనుల మనసులను ఆకర్షిస్తున్నాయి. ఈ సంసారం అనే సముద్రం

చాలా లోతైనది, విశాలమైనది అయినప్పటికీ, దానిని అవలీలగా దాటించగలిగిన సమర్ధులైన ఇద్దరు నావికుల వలె ఈ పాదాలు ఉన్నాయి. ఇటువంటి శ్రీ వేదాంతదేశికుల రెండు శ్రీచరణాలను నేను ఆశ్రయిస్తున్నాను.

*3) విశ్వాంతరాంధతమసక్షపణ ప్రవీణౌ*
*విద్యోతమానఖరేందురమయూఖజాలైః,*
*విఖ్యాతతామరసశంఖరథాంగచిహ్నౌ*
*వేదాంతసూరిచరణౌ శరణం ప్రపద్యే.*

లోకంలో చంద్రుడు తన కిరణాల కాంతితో చీకటిని పోగొడతాడు కానీ, ఆ చీకటిని, సూర్యుని వలె, పూర్తిగా పోగొట్టలేడు. వేదాంతదేశికుల పాదాలలోని గోళ్లు చంద్రుని వలె తెల్లగా ప్రకాశిస్తున్నాయి. చాలా గొప్పగా ప్రకాశించే, ఆ దేశికుల పాదాల గోళ్ళు అనే చంద్రులు తమ గొప్ప కాంతులలతో లోకంలో ఉండే అజ్ఞానమనే దట్టమైన చీకటిని సైతం సమూలంగా నాశనం చేయడంలో సామర్థ్యాన్ని కలిగి ఉన్నవి. అటువంటి గోళ్లను వేదాంతదేశికుల పాదాలు కలిగి ఉన్నవి. అంతేకాక, ఈ పాదాలు ప్రసిద్ధి చెందిన తామర పువ్వు, శంఖం, చక్రం మొదలైన మహాపురుష లక్షణాలను కలిగి ఉన్నవి. ఇటువంటి శ్రీ వేదాంతదేశికుల రెండు శ్రీచరణాలను నేను ఆశ్రయిస్తున్నాను.

*4) విద్వేషమానమదమత్సరవిద్విషౌ యౌ*
*విష్ణ్వాలయానుగమనోత్తమనిత్యకృత్యౌ,*
*వేదాంతవృద్ధవిహితాంజలిగోచరౌ తౌ*
*వేదాంతసూరిచరణౌ శరణం ప్రపద్యే.*

మదం, మాత్సర్యం అనే రెండు అంతః శత్రువులు. ఈ శత్రువులు రెండు వేదాంతదేశికుల పాద సంబంధం వల్ల పూర్తిగా నశించిపోతాయి. ఇంకా, ఈ పాదాలు ఎటువంటివి? అంటే, భగవంతుని ఆలయానికి వెళ్లడం అనే ఉత్తమమైన నిత్య కృత్యాన్ని కలిగినవి. వేదాంత శాస్త్రంలో పరిపూర్ణమైన జ్ఞానాన్ని కలిగిన

మహనీయులచేత ఇవి నమస్కరింపబడతాయి. ఇటువంటి శ్రీ వేదాంతదేశికుల రెండు శ్రీచరణాలను నేను ఆశ్రయిస్తున్నాను.

*5) విష్ణ్వర్పితాత్మజనభాగ్యవిపాకభూతౌ*
*విభాజమాననవకోకనదనుకల్పౌ,*
*వేషాంతరోపగతపల్లవతల్లజౌ తౌ*
*వేదాంతసూరిచరణౌ శరణం ప్రపద్యే.*

భగవంతుని సన్నిధిలో శరణాగతి చేసినవారి భాగ్యం ఈ వేదాంతదేశికుల పాదాల రూపంగా పరిణమించినట్లు తోస్తున్నది. అంటే, భగవంతుని విషయంలో శరణాగతి చేసిన వారి భాగ్యవశంచేత ఈ పాదాలు అవతరించాయి. ఈ పాదాల అందం ఎంత గొప్పది అంటే, గొప్పగా ప్రకాశించే, అప్పుడే పూచిన ఎర్రని తామర పూల వలె అవి ప్రకాశిస్తున్నాయి. పాదాల ఎర్రని వర్ణాన్ని చూస్తే, చాలా సుకుమారంగా ఉండే చిగుళ్ళు ఈ పాదాలుగా ఇంకొక రూపాన్ని పొందినట్లు తోస్తున్నది. ఇటువంటి శ్రీవేదాంతదేశికుల రెండు శ్రీచరణాలను నేను ఆశ్రయిస్తున్నాను.

*6) వేధోముఖైరపి సురైః విహితప్రణామౌ*
*వేలాతిలంఘిసుషమా సుకుమారభావౌ,*
*విస్మేరకేసరలసన్మృదులాంగుళీకౌ*
*వేదాంతసూరిచరణౌ శరణం ప్రపద్యే.*

వేదాంతదేశికుల శ్రీ చరణాల వైభవం ఎంత గొప్పది అంటే, వీటిని బ్రహ్మ మొదలైన దేవతలు సైతం నమస్కరిస్తారు. అంటే, వీటి సంబంధంచేత తమకు ఉజ్జీవనం కలుగుతుంది అని వారు భావిస్తారు. వేదాంతదేశికుల వైభవం, మహిమ అంత గొప్పది. ఈ పాదాల సౌకుమార్యం అవధి లేనిది. తామర పువ్వులో కేసరాలు ఉంటాయి కదా. ఆ విధంగానే ఈ దేశికుల పాదాలు అనే తామర పువ్వులో కూడా ప్రకాశించే మృదువైన వేళ్ళుఅనే కేసరాలు ఉన్నాయి. ఇటువంటి శ్రీ వేదాంతదేశికుల రెండు శ్రీచరణాలను నేను ఆశ్రయిస్తున్నాను.

*7) విద్రావితోద్భటవికారరజోగుణౌ తౌ*
*విఖ్యాతభూరివిభవేన రజఃకణేన,*
*విశ్వోపకారకరణాయ కృతావతారౌ*
*వేదాంతసూరిచరణౌ శరణం ప్రపద్యే.*

వేదాంతదేశికుల పాదాలను ఆశ్రయించడం వల్ల ఎంతో తీవ్రమైన వికారాలను కలిగించే రజోగుణం అయినా దూరంగా పరిగెత్తుకొని పోతుంది. ఇంకా ఆశ్చర్యం ఏమంటే, ఈ విధంగా రజోగుణాన్ని సమూలంగా పోగొట్టగలిగిన దేశికుల పాదాలు రజస్సును కలిగి ఉండడం. (ఇక్కడ రజస్సు అంటే శ్రీ చరణ పరాగం) దేశికుల పాదాలు తామర పువ్వు వంటివి కనుక తామర పువ్వులో పుప్పొడి ఉన్నట్లే, ఈ తామరలలో కూడా పాదరజస్సు అనే పుప్పొడి ఉన్నది. ఈ పాద రజస్సు లోని ఒక్క కణం చాలు, సంసార సంబంధాన్ని పోగొట్టడానికి. అటువంటి గొప్ప మహిమను ఆ రజఃకణం కలిగినది. భగవంతుడు లోకానికి ఉపకారం చేయడం కోసం ఈ లోకంలో అవతరిస్తాడు. ఆ విధంగానే లోకానికి మహోపకారంచేయడం కోసం వేదాంతదేశికుల పాదాలు అవతరించాయి. ( ఇక్కడ "కృతవతారౌ" అనే పదప్రయోగ సామర్థ్యం చేత దేశికుల పాదాలు చల్లని తటాకాల వంటివి అనే అర్థస్వారస్యం కూడా ధ్వనిస్తున్నది. అవతార శబ్దానికి "దిగి స్నానం చేసే రేవు" అని కూడా అర్థం ఉన్నది కదా. అందుచేత దేశికుల పాదాలు రెండు తీర్థాల వంటివి అనే మధురమైన భావం ఇక్కడ వ్యక్తమవుతున్నది)ఇటువంటి శ్రీ వేదాంతదేశికుల రెండు శ్రీచరణాలను నేను ఆశ్రయిస్తున్నాను.

***8)** విష్వంఘ్రినిర్గత సరిత్ప్రవరానుభావ్యౌ*
*విద్యావినీతజనితైః విమలైః స్వతీర్థైః,*
*వ్యానమ్రశిష్యజన రక్షణజాగరుకౌ*
*వేదాంతసూరిచరణౌ శరణం ప్రపద్యే.*

విద్య, వినయం మొదలైన గొప్ప గుణాలను కలిగిన వేదాంతదేశికుల శ్రీపాద తీర్థం విమలమైనది, అతిపవిత్రమైనది. అటువంటి తీర్థం కలిగిన దేశికుల శ్రీపాదాలు ఎటువంటి పాపాలనైనా పోగొట్టగలిగినవి. అందుచేత, అవి, ఆనాడు విష్ణు పాదం నుండి పుట్టిన గొప్ప నది అయిన గంగతో సమానంగా భావించదగినవి. ( గంగాజలం ఏ విధంగా పవిత్రమో, ఆ విధంగానే దేశికుల శ్రీపాద తీర్థం పవిత్రమని తాత్పర్యం), తమకు నమస్కరించే శిష్యజనులను రక్షించడంలో అవి ఎల్లప్పుడూ జాగరూకతను కలిగి ఉంటాయి. ఇటువంటి శ్రీవేదాంతదేశికుల రెండు శ్రీచరణాలను నేను ఆశ్రయిస్తున్నాను.

*9) వీథీషు రంగనగరే కృతచంక్రమౌ తౌ*
*విష్ణోత్సవేషు విధివాసవ సేవితేషు,*
*విద్యావినీత జనతా విహితానుసారౌ,*
*వేదాంత సూరి చరణౌ శరణం ప్రపద్యే.*

బ్రహ్మ, ఇంద్రుడు మొదలైన దేవతలు అందరూ వచ్చి సేవించే, శ్రీరంగ నగరంలో జరిగే శ్రీరంగనాథుని ఉత్సవ సమయాలలో, ఆ నగరంలోని వీధులలో వేదాంతదేశికుల శ్రీచరణాలు అంతటా సంచరిస్తాయి. ఈ విధంగా శ్రీరంగనాథుని దేశికులు అనుసరిస్తూ ఉండగా, వారి శ్రీచరణాలను విద్య, వినయం మొదలైన సద్గుణాలను కలిగిన మహనీయులు అందరూ అనుసరించారు. ఇటువంటి, మహనీయులకు అనగమ్యాలైన శ్రీ వేదాంతదేశికుల రెండు శ్రీచరణాలను నేను ఆశ్రయిస్తున్నాను.

*10) విశ్వాసవిష్ణుపదభక్తివిరక్తిశూన్యం*
*విభ్రష్ట కృత్యమపి మాం విషయేషు సక్తమ్,*
*విద్వత్సభానుగతియోగ్య మిహాదధానౌ*
*వేదాంత సూరి చరణౌ శరణం ప్రపద్యే.*

నాకు భగవంతునిలో విశ్వాసం లేదు. ఆ స్వామి పాదాలలో భక్తి లేదు. లౌకిక విషయాలలో విరక్తి లేదు. ఇంతే కాదు, అనేక భ్రష్ట కృత్యాలను చేశాను. ఇంతే కాదు, లౌకిక విషయాలలోనే ఆసక్తిని కలిగి ఉన్నాను. ఇటువంటి ఏ యోగ్యత లేకుండా, అన్ని

దోషాలతో నిండిన నాకు కూడా పండితుల సభలలో అన్వయించే యోగ్యతను వేదాంతదేశికుల పాదాలు కలిగిస్తున్నాయి. అంటే, వేదాంతదేశికుల పాదాలతో నాకు ఉండే సంబంధాన్ని చూచి, మహనీయులైన పెద్దలందరూ నన్ను ఒక వస్తువుగా పరిగణించి, వారిలో ఒకడనుగా నన్ను పరిగ్రహించారు. ఇటువంటి శిష్టజన పరిగ్రహత్వం అనే అదృష్టం నాకు దేశికుల శ్రీ చరణ సంబంధం వల్లనే లభించింది. ఇటువంటి శ్రీవేదాంతదేశికుల రెండు శ్రీచరణాలను నేను ఆశ్రయిస్తున్నాను.

కవితార్కికసింహాయ కళ్యాణ గుణశాలినే.
శ్రీమతే వేంకటేశాయ వేదాంతగురవే నమః.



# శ్రీవేదాంత దేశిక ప్రార్థనాష్టకమ్

అత్యంతమధురమైన ఈ స్తోత్రాన్ని వేదాంతదేశికుల కుమారులైన శ్రీకుమార వరదాచార్య స్వామివారు అనుగ్రహించారు. వీరు దేశికుల విషయంలో వేదాంతదేశిక మంగళం మొదలైన స్తుతులను సంస్కృతంలో, పిళ్లై అందాది అనే కృతిని ద్రావిడంలో అనుగ్రహించారు. ఇవి అన్ని భాషలో, భావంలో సహృదయ హృదయ రంజకాలై, నిత్యాను సంధేయాలై విరాజిల్లుతున్నాయి. వేదాంతదేశిక ప్రార్థనాష్టకం అనే ఈ స్తోత్రం ఎనిమిది శ్లోకాలతో కూడినదై, వేదాంతదేశికుల సన్నిధిలో మన అందరి కోసం వీరు చేసే ప్రార్థనా రూపమై ఉన్నది. ఆనాడు మన అందరి కోసం భగవద్రామానుజులు శ్రీరంగంలో దివ్య దంపతుల సన్నిధిలో శరణాగతి చేసినట్లే, ఈ ప్రార్థన కూడా మన అందరి హితం కోసం పరమ దయాళువు అయిన కుమార వరదాచార్య స్వామివారు చేశారని భావించాలి. ఇందులోని పలు శ్లోకాలలోని భావాలు ప్రార్థనా పంచకం అని ప్రసిద్ధమైన భగవద్రామానుజుల స్తుతిలోని భావాలతో పోలి ఉండడం గమనించదగినది.

శ్రీమాన్ వేంకటనాథార్యః కవితార్కికకేసరీ,
వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది.||

శ్రీమల్లక్ష్మణ యోగీంద్ర సిద్ధాంత విజయధ్వజమ్,
విశ్వామిత్ర కులోద్భూతం వరదార్య మహం భజే.||

*1) త్రయీచూడాగురో! స్వామిన్!*
*కృపాంభోరాశినా త్వయా,*
*విజ్ఞాపనం మామకీయం*
*శ్రోతవ్యం శ్రితవత్సల!.*

శ్రీ వేదాంతదేశిక స్వామీ! భక్తుల విషయంలో ఉండే దోషాలను గమనించకుండా, వారి విషయంలో వాత్సల్యాన్ని వర్షించే స్వభావాన్ని కల స్వామీ! "కరుణాసముద్రులైన మీరు దాసుడు చేసే ఈ విజ్ఞాపనను ఆలకించి అనుగ్రహించాలి"అని ప్రార్థిస్తున్నాను.

*2) త్రయ్యంతార్య! భవత్పాద*
*పంకేరుహజుషాం సతామ్,*
*స్వయం మయి సదా భూయాత్*
*అనుగ్రహ పరంపరా.*

శ్రీ వేదాంతదేశిక స్వామీ! దేవరవారి శ్రీచరణ పద్మాలలో సదా అభినివేశాన్ని కలిగి ఉండే భాగవతుల అనుగ్రహం నా విషయంలో నిరంతరంగా కలిగేటట్లు దేవరవారే అనుగ్రహించాలి.

ముందు శ్లోకంలో ఆచార్య విషయంగా ప్రథమ పర్వాత్మకంగా ప్రార్థన చేయబడగా, ఇందులో వారి భక్తుల విషయంలో చేయబడడం వల్ల ఇది చరమ పర్వంలో చరమ పర్వం.

*3) శ్రీసంయమీంద్ర సిద్ధాంత*
*నిధిరక్షైకదీక్షిత!*
*నియతం కురు దాసం మాం*
*సర్వతంత్ర స్వతంత్ర! తే.*

సర్వ తంత్ర స్వతంత్రులైన వేదాంతదేశిక స్వామీ! భగవద్రామానుజుల అద్భుతమైన సిద్ధాంతం అనే గొప్ప నిధిని రక్షించి, దానిని మాకు లభించేటట్లు చేసిన ఉదారులు మీరు. ఇందుకోసమే దేవరవారు అవతరించి, దీక్షను పరిగ్రహించినట్లుగా

మాకు గొప్ప సంపదను అనుగ్రహించారు. అటువంటి తమరే నన్ను కూడా మీకు దాసునిగా చేసికొని, నిరంతరం ఆ సంపదను దాసుడు అనుభవించేటట్లు అనుగ్రహించాలి –అని ప్రార్థిస్తున్నాను.

*4) జ్ఞానభక్త్యాదిసత్సంపత్*
*ప్రదాయిన్యాఽనుకంపయా,*
*స్యాదసా వితి వీక్షస్వ*
*వేదాంతాచార్యవర్య !మామ్.*

వేదాంత దేశిక స్వామీ!దేవరవారి కరుణా కటాక్షం అనేది జ్ఞానం, భక్తి, వైరాగ్యం మొదలైన గొప్ప గొప్ప సంపదలను అనుగ్రహించగలిగినది, అటువంటి దేవర వారి కరుణాకటాక్షాన్ని ఒక వస్తువు కానటువంటి దాసునిపై ప్రసరింపచేసి, ఒక వస్తువుగా చేసి రక్షించాలి– అని ప్రార్థిస్తున్నాను.

*5) శ్రీ వేంకటేశఘంటాత్మన్!*
*యతీంద్ర శఠజిత్ ప్రియ!,*
*రహస్యత్రయ సారోక్త*
*నిష్ఠాం శ్రేష్ఠాం ప్రయచ్ఛ మే.*

శ్రీ వేంకటేశ్వరుని ఆలయంలోని ఘంట యొక్క అంశతో అవతరించిన వేదాంతదేశిక స్వామీ! భగవద్రామానుజుల, శ్రీనమ్మాళ్వార్ల మనసులు ఆనందించేటట్లుగా అవతరించిన మహానుభావా! ఒకే ఒక్క ప్రార్థనను తమ సన్నిధిలో నేను చేస్తున్నాను. అది ఏమంటే, రహస్యత్రయసారం అనే దేవరవారి గ్రంథంలో భాగవతుల, శరణాగతుల ఉత్తమ స్థితిని గూర్చి దేవరవారు చాలా స్పష్టంగా అనుగ్రహించారు కదా. అటువంటి స్థితి నాకుకూడా కలిగేటట్లు దేవరవారే అనుగ్రహించాలి –అని ప్రార్థన చేస్తున్నాను.

*6) త్వత్కృతిష్వాగమాంతార్య!*
*సమ్యక్కృత పరిశ్రమైః,*
*నిత్యయోగో మహాభాగైః*
*త్వదేకాంతిభి రస్తు నః.*

శ్రీ వేదాంతాచార్యవర్యా! దేవర వారి గ్రంథాలలో చాలా అవినివేశాన్ని కలిగినవారై, వాటిలోనే మనస్సును నిలిపి, వాటిలోని రసాన్ని ఆస్వాదించి, తమ జీవితాన్ని సార్థకం చేసికొనే మహానుభావులు పలువురు ఉన్నారు కదా. వారు మిమ్ములను తప్ప ఇంకెవరిని భావించని అనన్య భక్తిని కలవారు. వారి గోష్ఠిలో దాసుడు అన్వయించి వారికి దాసుడనై జీవితాన్ని సఫలం చేసుకొనేటట్లు తమరే నన్ను అనుగ్రహించాలి.

ప్రార్థనాపంచకంలోని "ఆమోక్షం లక్ష్మణార్య !త్వద్గ్రంథపరిశీలనైః, కాలక్షేపోఽస్తు న సద్భిః సహవాసముపేయుషామ్" అనే శ్లోకాన్ని ఈ శ్లోకం గుర్తు చేస్తున్నది

*7) కదాపి క్వాపి కేనాపి*
*కవితార్కికసింహ!మామ్,*
*శ్రీకాంతతత్ప్రరాచార్యే*
*ష్వప్రష్టాగసం కురు.*

ప్రార్థనా పంచకంలోని "యథాపరాధా న స్యు ర్మే భక్తేషు భగవత్యపి, తథా లక్ష్మణ యోగీంద్ర! యావద్దేహం ప్రవర్తయ" అనే శ్లోకాన్ని ఈ శ్లోకం అనుకరిస్తున్నది.

ఓ కవితార్కిక సింహమా! భగవంతుని విషయంలో దాసునకు ఏనాడు కూడా అపచారం అనేది సంభవించకూడదు. అంతే కాదు, ఆ భగవంతుని ఆశ్రయించిన భక్తుల విషయంలో, అంతే కాదు, ఆచార్యుల విషయంలోనూ ఏ సమయంలోనూ, ఎక్కడా

కూడా, ఏ రకంగానూ అపచారం అనేది కొంచెం కూడా సంభవించకూడదు. ఆ విధంగా దాసుని దేవరవారే అనుగ్రహించాలి.

*8) శ్రీమద్వేంకటనాథార్య!*
*త్వదీయ చరణద్వయమ్,*
*భవత్వత్ర పరత్రాపి*
*మదీయం శరణం సదా.*

శ్రీ వేంకటనాధార్యా! శ్రీ వేంకటేశ్వరుని అపరావతారమా! దేవర వారి రెండు శ్రీ చరణ పద్మాలే దాసునకు అద్వితీయమైన గతి. అవే ఉపాయం. అంతేకాదు. నేను శ్రీవైకుంఠానికి వెళ్లినప్పటికీ అక్కడ కూడా దేవర వారి శ్రీపాద పద్మాలే నాకు ప్రాప్యంగా ప్రకాశిస్తాయి. ఆ విధమైన స్థితియే దాసునకు కలిగేటట్లు అనుగ్రహించాలి.

*9) సాదరం వ్యాహరన్నే తత్*
*ప్రత్యహం ప్రార్థనాష్టకమ్,*
*వేదాంతాచార్యపాదాబ్జ*
*భక్తిరత్నా కరో భవేత్.*

ఈ వేదాంతదేశికప్రార్థనాష్టకం అనే స్తోత్రాన్ని చాలా ఆదరంతో, మిక్కలి భక్తితో ఎవరు అనుసంధిస్తారో, వారికి వేదాంతదేశికుల శ్రీ చరణ పద్మాలలో భక్తి అనేది చాలా అధికంగా కలిగి, వారు ఆ భక్తికి సముద్రంగానే కాగలరు.

*10) జయతి శ్రుతి చూడార్యః*
*శ్రీమా నద్భుత చంద్రమాః,*
*సకలా యత్ర హి కలాః*
*నిర్మలా నిత్యపుష్కలాః.*

శ్రీ వేదాంత దేశికులు ఆశ్చర్యాన్ని కలిగించే చంద్రుని వంటివారు. వారు అందరికీ ఎల్లప్పుడూ చల్లదనాన్నే కలిగిస్తారు. ఈ లోకంలోని చంద్రునిలో అయితే, కళంకం

ఉంటుంది, కానీ, వేదాంతదేశికులు అనే చంద్రునిలో ఏక లంకం లేదు. ఈ లోకంలోని చంద్రునిలో పౌర్ణమితిథిలో మాత్రమే అన్ని కళలు పూర్ణంగా ఉంటాయి. కానీ, దేశికులు అనే ఈ చంద్రునిలో ఎల్లప్పుడూ కలలు పూర్తిగా ఉంటాయి. సకల కళానిధి కదా దేశికులు. అంతే కాదు, వీరు నిత్య పుష్టిని కలిగి ఉంటారు.

దేశికులు భగవద్రామానుజులను యతిరాజసప్తతిలో అలౌకిక చంద్రునిగా వర్ణించగా, కుమార వరదాచార్య స్వామివారు వారిని అద్భుత చంద్రునిగా వర్ణిస్తున్నారు.

అటువంటి దేశికుల విషయంలో మంగళాశాసనం చేసి, ప్రార్థిస్తూ రచించిన ఈ ప్రార్థనాష్టకం అనే స్తుతి మనం గ్రహించవలసిన విషయాలను అన్నిటిని అనుగ్రహిస్తున్నది. దేశికుల సన్నిధిలో శరణాగతి చేసిన మనకు జ్ఞానం ఆవశ్యకం. ఏ విషయంలోనూ మనకు సందేహం, భ్రాంతి, విపర్యయ జ్ఞానం లేకుండా ఉండే స్పష్టమైన జ్ఞానం ఆవశ్యకం. దానిని స్వామి దేశికుల అనుగ్రహమే మనకు ఇస్తుంది. సంసారంలో ఎన్నో కష్టాలను అనుభవించే మనకు ఆ కష్టాలను అన్నిటినీ తట్టుకునే శక్తిని, అంటే, రహస్య త్రయసారంలో చెప్పబడిన విధంగా, ఆత్మ నిష్ఠ అనేదానిని, ఉపాయనిష్ఠ అనేదానిని, ఫలనిష్ఠ అనేదానిని మనకు కలిగిస్తుంది. అంతేకాక, దేశికుల అనుగ్రహించేత భక్తి లభిస్తుంది, వైరాగ్యం కలుగుతుంది. ఇవి అన్నీ లభించడానికి స్వామిదేశికుల అనుగ్రహం తప్ప వేరు దారి లేదు. అందుచేత దీనినే మనం ప్రతి దినం ప్రార్థించాలి –అనే విషయాన్ని ఈ స్తోత్రం ద్వారా మనకు కుమార వరదాచార్య స్వామి వారు అనుగ్రహించారు. వారి సన్నిధిలో మనం కృతజ్ఞతాపూర్వకంగా సాష్టాంగంగా నమస్కరిద్దాం.

శ్రీమతే నిగమాంత మహాదేశికాయ నమః.

# నిగమపరిమళం

వేదాంతదేశికులు అనుగ్రహించిన శతాధిక గ్రంథాలలో నిగమ పరిమళం అనే గ్రంథం ఒకటి. ఇది ఈనాడు లభించడం లేదు. లుప్తమైపోయింది. అయినప్పటికీ, ఈ గ్రంథానికి సంబంధించిన కొన్ని ఆధారాలు ఇతర గ్రంథాల వల్ల మనకు కొంతవరకు లభిస్తున్నాయి. ఈ గ్రంథం వలెనే దేశికులు రచించిన ఇంకా ఎన్నో గ్రంథాలు ఈనాడు మనకు లభించడం లేదు. ఏ గ్రంథాల పేర్లు మాత్రం మనకు తెలుసో, ఆ గ్రంథాలలో కొన్ని మనకు లభిస్తున్నట్లు, మరికొన్ని లభించనట్లు మనం భావిస్తున్నాము. కానీ, పేర్లు కూడా తెలియని దేశికుల గ్రంథాలు ఇంకా ఎన్నో ఉండి ఉండాలి. ప్రతివాది భయంకరం అణ్ణన్ అనే పూర్వాచార్యులు సప్తతిరత్నమాలిక అనే గ్రంథంలో " పరశ్శతం వాపి పరస్సహస్రం శ్రీవేంకటాచార్యకృతాః ప్రబంధాః" అని అంటూ "దేశికుల గ్రంథాలు వందలు కాదు, వేలాదిగా ఉండి ఉండాలి"—అని అన్నారు. ఆ కాలంలో గ్రంథాలన్నీ తాళపత్రాలలో లిఖించబడేవి. ఆ విధంగా వ్రాయబడిన గ్రంథాలు, ఈనాడు వందల కొలది, వేల కొలది సంఖ్యలో ప్రతులు ఉన్నట్లుగా, ఎక్కువ సంఖ్యలో ఉండేవి కావు. రెండో, మూడో మాత్రమే ఉండేవి, అవి లుప్తమైతే, ఆ గ్రంథం లోపించిపోయినట్లే కదా. అందుచేత, ఎన్నో గ్రంథాలు ఈనాడు మనకు దొరకకుండా లుప్తమైపోయాయి— అని భావించవలసి ఉన్నది. ఆ విధంగా, సంఖ్యాకంగా రచింపబడిన వేదాంతదేశికుల గ్రంథాలలో ఈ నిగమపరిమళం అనేది ఒకటి. ఇది చాలా పెద్దది, ప్రధానమైనదికూడా — అని తెలుస్తున్నది.

ఈ గ్రంథాన్ని గూర్చి చాలామంది పూర్వాచార్యులు తమ గ్రంథాలలో ప్రస్తావించి, కొన్ని విశేషాలను మనకు తెలియజేశారు. తృతీయ బ్రహ్మతంత్ర స్వతంత్ర పరకాల స్వామి తాము అనుగ్రహించిన మూవాయిరప్పడి గురుపరంపరా ప్రభావం అనే గ్రంథంలో ఈ నిగమపరిమళం అనే గ్రంథానికి సంబంధించిన ప్రస్తావనలను ఆరు చోట్ల చేశారు. అందులో, "పిన్బొరు రాత్రియిలే" అని ఆరంభమవుతున్న ఒక వాక్యం ఉన్నది. దేశికులకు నమ్మాళ్వారులు స్వప్నంలో సాక్షాత్కరించి, " నమ్ముడైయ నియమనత్తై నీ

తల్లై క్కట్ట క్కడవాయ్" – నా నియమనాన్ని నీవు పూర్తి చేయాలి– అని ఆజ్ఞాపించారట. ఆ ఆజ్ఞను శిరసా వహించి, దేశికులు ఈ గ్రంథాన్ని రచించారట.. ఈ గ్రంథం ఎటువంటిది అంటే,

భగవద్రామానుజులు తమ జ్ఞానపుత్రులైన తిరుక్కురుకై ప్పిరాన్ పిళ్ళాన్ ను, కటాక్షించగా, భగవద్విషయం అనే పేరుతో ఈ నాడు ప్రసిద్ధమైన ఆరాయిరప్పడి అనే అనే వ్యాఖ్యానాన్ని తిరువాయ్ మొ*ళ్గి* ప్రబంధానికి 6000 గ్రంథసంఖ్యలో రచించారు. పడి అంటే– 32 అక్షరాల పరిమితిని కలిగిన ఒక ప్రమాణం. అంటే, ఒక అనుష్టుప్ శ్లోకంలో ఉండే అక్షరాల పరిమితిని కలిగినది, ఈ పడి. ఈ ఆరాయిరప్పడి గ్రంథానికి వ్యాఖ్యాన రూపమైన నిగమ పరిమళం అనే గ్రంథం ఎ*ట్రు*పత్తు నాలాయిరప్పడి అనే 74 వేల గ్రంథ సంఖ్యను కలిగినది. ఉదాహరణంగా, తిరువాయ్ మొ*ళ్గి* ప్రబంధంలో వేయి పాశురాలు. ఆరాయిరప్పడిలో ఆరువేల పడులు ఉన్నాయి. ఈ నిగమ పరిమళంలో 74 వేల పడులు ఉన్నాయి. ఈ నిగమ పరిమళం గ్రంథం సహస్ర గీతి అనబడే తిరువాయ్ మొ*ళ్గి* ప్రబంధానికి కల వ్యాఖ్యానాలు అన్నిటిలో చాలా పెద్దది. అందుచేత "తేనే బృహతీమ్ వివృతిమ్" అని అంటూ ఈ నిగమ పరిమళాన్ని గూర్చి "చాలా పెద్దదైన వ్యాఖ్యానం" అని ఒక కవి అన్నారు. ఈ 74 వేల గ్రంథాల పరిమితిని కల ఈ ప్రబంధాన్ని రచించదలచి దేశికులు, మొదట దాని అవతారికలో నాలాయిర దివ్య ప్రబంధంలోని అర్థాలను అన్నిటినీ సంగ్రహంగా ఉపపాదించారు. ఆ గ్రంథం యొక్క శైలి అటువంటిది. ఆ తరువాత 74 వేల గ్రంథ పరిమితిలో తిరువాయ్ మొ*ళ్గి* ప్రబంధానికి వ్యాఖ్యానాన్ని రచించి పూర్తిచేసి, తాము రచించిన అవతారికకు "నాలాయిర క్కరుత్తు" అనే పేరును స్వయంగా పెట్టారు– అని ఈ వివరాలు అన్నీ మూవాయిరప్పడి గురుపరంపరా ప్రభావంలో లభిస్తున్నాయి.

దీనికి తరువాత, చోళసింహపురంలో వేంచేసి ఉన్న, గొప్పదేశిక భక్తులైన చండమారుతం దొడ్డయాచార్యస్వామి శ్రీమద్వేదాంతదేశిక వైభవ ప్రకాశిక అనే ఒక గొప్ప గ్రంథాన్ని

శ్లోకరూపంగా అనుగ్రహించారు. దానికి వ్యాఖ్యాన రూపంగా వారి శిష్యులైన మహాచార్య దాసులు అనే పేరును కల పెరియప్పంగార్ ఒక మణిప్రవాళ శైలిలోని గ్రంథాన్ని అదే పేరుతో రచించారు. దొడ్డయాచార్యస్వామి రచించిన గ్రంథంలో ఈ నిగమపరిమళ గ్రంథానికి సంబంధించిన ప్రస్తావన కనిపిస్తున్నది. "గ్రంథైః చతు స్సప్తతిభిః సహస్రైః చతుః సహస్రార్థవిశేషయుక్తామ్, యః షట్ సహస్రస్య చకార వృత్తిం తం దేశికం నౌమి శతం సహస్రమ్" అనే శ్లోకాన్ని అందులో అనుగ్రహించారు. ఈ శ్లోకంలో దొడ్డయాచార్య స్వామి కవి అయినందున, చమత్కారంగా పలుకుతున్నారు ఈ శ్లోకంలో ఒక్కొక్క పాదంలోనూ సహస్ర శబ్దాన్ని ప్రయోగించారు. "గ్రంథైః చతు స్సప్తతిభిః సహస్రైః" అని గ్రంథం పేరు సూచించారు. ఇక్కడ ఒక సహస్ర పదం వచ్చింది "చతుః సహస్రార్థవిశేషయుక్తామ్" అని అంటూ ఈ గ్రంథంలో నాలాయిర దివ్యప్రబంధంలో ఉండే అర్థవిశేషాలు పొందుపరచబడ్డాయి– అని సూచించారు. "చతుః సహస్రం" అంటే –నాలాయిరమ్. మిగిలిన వ్యాఖ్యాతలు అందరూ తిరువాయ్ మొళి ప్రబంధానికి వ్యాఖ్యానాన్ని రచించేటప్పుడు ఆ ప్రబంధానికి మాత్రమే వివరణను అనుగ్రహించారు. ఈ ఎ(ట్రుపత్తు నాలాయిరప్పడి అనే గ్రంథం కూడా అటువంటిదే అయినా, ఇందులో దేశికులు అవతారిక అనే భాగాన్ని కూర్చి, అందులో నాలాయిర దివ్యప్రబంధంలోని అర్థవిశేషాలను పొందుపరచారు. ఇక్కడ కూడా ఇంకొక సహస్ర పదం వచ్చింది. "యః షట్ సహస్రస్య చకార వృత్తిమ్" – ఇక్కడ షట్ సహస్రం అంటే– ఆరాయిరప్పడి వ్యాఖ్యానం. దానికి ఒక వృత్తిని, అంటే, వివరణను, రచించారు దేశికులు. అదే, ఎ(ట్రుపత్తు నాలాయిరప్పడి. ఇక్కడ ఒక సహస్రపదం వచ్చింది. "తం దేశికం నౌమి శతం సహస్రమ్ " అనే నాలుగవ పాదంలో ఇంకొక సహస్ర పదం వచ్చింది. ఈ విధంగా ప్రతిపాదంలోనూ సహస్రపదాన్ని దొడ్డయాచార్యస్వామివారు ప్రయోగించారు.

మహాచార్య దాసులు అనే పెరియప్పం గార్ స్వామి దీనికి వివరణాన్ని రచించేటప్పుడు కొంచెం అధికంగా వివరాలను కూడా తెలియజేశారు. ఈ వివరాలు బ్రహ్మతంత్ర స్వతంత్ర స్వామి తెలియజేసిన వివరాలే. ఆరాయిరప్పడి గురుపరంపర ప్రభావంలో

ఏమని ఉన్నది అంటే " అప్పుళ్ళార్కరుడైయ ఉపన్యాసంగళై క్కొండు" అనే ఒక ప్రయోగం ఉన్నది. దీని భావం ఏమంటే –దేశికులు తాము రచించిన ఎ(ౘ్రుపత్తు నాలాయిరప్పడి అనే గ్రంథంలో తమకు ఆచార్యులు, మేనమామ అయిన ఆత్రేయ రామానుజాచార్యులవారు తమకు అనుగ్రహించిన వివరాలనే పొందుపరచారు –అని దీని భావం. తమ ఆచార్యులు తమకు అనుగ్రహించిన వివరాలను, విషయాలను ఎ(ౘ్రుపత్తు నాలాయిరప్పడిగ్రంథంలో విస్తరించారు– అని తెలిపినట్లయినది. దేశికులకు సహజంగా ఒక అలవాటు ఉన్నది. తాము తమ ప్రతిభా పాండిత్యాలతో స్వయంగా అనుగ్రహించిన విషయాలనుకూడా తమ ఆచార్యుల అనుగ్రహం వల్లనే లభించాయి–అని వినయంగా పలికే అలవాటు వారికి ఉన్నది. అయితే, ఇక్కడ మిగిలిన గ్రంథకర్తలు కూడా ఆ విధంగానే తెలియజేయడం వల్ల, దేశికులకు ఆత్రేయ రామానుజాచార్యులవారు ఉపన్యసించి, అనుగ్రహించిన అర్థవిశేషాలను అన్నిటినీ వారు ఎ(ౘ్రుపత్తు నాలాయిరప్పడిగ్రంథంలో తెలియజేశారు– అని భావించవలసి ఉన్నది.

పెరియప్పంగార్ ఈ విషయాన్ని తెలియజేసే సందర్భంగా కొత్తగా, మూడు, నాలుగు నూతన విషయాలను ప్రస్తావించారు. అందులో ఒకటి ఏమంటే, నిగమ పరిమళం అనే పేరును గ్రంథానికి. దేశికులు పెట్టారు– అనేది. రెండవ విషయం ఏమంటే, " నిగమ పరిమళమ్ ఎన్ఱు అరుళిచ్చెయ్ దార్ ఎన్ఱు అరుళిచ్చెయ్ వార్ కళ్ " అనే వాక్యాన్ని కూడా అక్కడ ఉదాహరించారు. అంటే, ఆ నిగమపరిమళం అనే గ్రంథం వీరి కాలంలోనే వీరికి లభించలేదు –అని తెలుస్తున్నది. ఈ విషయం సూచించేటట్లుగా. "నిగమపరిమళమ్ ఎన్ఱు అరుళి చ్చెయ్ దార్ ఎన్ఱు అరుళిచ్చెయ్ వార్ కళ్" అని ఆ వాక్యంతో వారు ముగించారు.

ఈ విధంగా, ఆ, ఇంతవరకు మూడు గ్రంథాలలో నిగమపరిమళమనే ఎ(ౘ్రుపత్తు నాలాయిరప్పడి. గ్రంథాన్ని గురించి లభించిన వివరాలను గమనించాము.

పెరియప్పంగార్ వ్యాఖ్యానంలో అధికంగా వివరాలు ఉన్నాయి అని అనుకున్నాము కదా. అందులో లభించే ఇంకొక వివరం ఏమంటే "ఆరాయిరప్పడియోడు ఎణ్బది నాయిరప్పడియాక వ్యాఖ్యానత్తై అరుళిచ్చెయ్ దార్" అనే వాక్యాన్ని అందులో ప్రయోగించారు. ఎ(మ్రపత్తు నాలాయిరప్పడి గ్రంథానికి ఆధారం ఆరాయి రప్పడి, ఈ రెండూ కలిస్తే, ఎణ్బది నాయిరప్పడి, అంటే 80 వేల గ్రంథ పరిమితిని కలిగిన గ్రంథాన్ని రచించారు– అని. ఇది ఇక్కడ తప్పక చెప్పాలి ఎందుకంటే, తరువాత కొంతమంది ఈ నిగమపరిమళ గ్రంథాన్ని ఎణ్బది నాయిరప్పడి అనే పేరుతో నిర్దేశించారు. మనకు ఏమని తోస్తుందంటే, ఎ(మ్రపత్తు నాలాయిరప్పడి. అని కదా, ఈ గ్రంథానికి పేరు. మరి, కొంతమంది ఎణ్బది నాయిరప్పడి అనే పేరుతో దీనిని నిర్దేశించడం ఏమి? అని తోచవచ్చు. ఎ(మ్రపత్తు నాలాయిరప్పడి అనే వ్యవహారం ఉన్నట్లు "గ్రంథైః చతుస్సప్తతిభిః సహస్రైః" అనే ప్రయోగం ద్వారా ఇంతకుముందే మనం గమనించాము కదా. ఎణ్బది నాయిరప్పడి అనే వ్యవహారం కూడా మనకు కనిపిస్తున్నది. తిరుక్కుడంద్దై దేశికన్ అనుగ్రహించిన వేదాంతదేశికుల సహస్రనామ స్తోత్రంలో "కృతాశీతిసహస్ర ద్రవిడాగమపరీమళః" అనే ఒక నామాన్ని పొందుపరచారు. ద్రవిడాగమపరిమళం అనే పేరు కలిగిన, 80 వేల గ్రంథ పరిమితిని కల గ్రంథాన్ని దేశికులు రచించారు –అని దీని అర్థం.

"ఎణ్బది నాయిరప్పడి" అని, "ఎ(మ్రపత్తు నాలాయిరప్పడి" అని ఈ విధంగా రెండు విధాలేన వ్యవహారాలు ఏ విధంగా వచ్చాయి? ఈ రెండు పేర్లను చూస్తే, ఒక దానికి ఒకటి విరోధంగా ఉన్నవి ఈ విరోధాన్ని ఏ విధంగా సరి చేయడం? అనేదానికి సమాధానంగా పైన ఉదాహరించిన పెరియప్పం గార్ సూక్తి ఉన్నది. అంతకుముందే ఉండే ఆరాయిరప్పడి గ్రంథంతో కలసి ఎ(మ్రపత్తు నాలాయిరప్పడి ఎణ్బది నాయిరప్పడి అయినది అని, ఆ విధంగా "ఎణ్బది నాయిరప్పడి" అనే వ్యవహారం ఏర్పడిందని తెలుస్తున్నది.

ఇంతవరకు ముగ్గురు మహానుభావుల సూక్తులను నిగమ పరిమళ గ్రంథానికి సంబంధించి గమనించాము. దానితో పాటు, తిరుక్కుడంధై దేశికన్ అనుగ్రహించిన సూక్తిని కూడా గమనించాము. వేదాంతదేశికుల విషయంగా వేదాంతదేశిక విజయచంపు అనే ఒక కావ్యాన్ని పరవాస్తు వంశానికి చెందిన, కౌశిక కవితార్కిక సింహం అనే పేరు కలిగిన మహనీయులు ఒకరు రచించారు ఆ కావ్యంల్లో దేశికులు నమ్మాళ్వార్లకు చేసిన కైంకర్యాలనుగూర్చి చెప్పేటప్పుడు, "పరాంకుశ గురోః తత్త్ర గిరాం భావం ప్రకాశయన్, గ్రంథానభిదధే ప్రాచాం పంథాన మయమాశ్రితః" అని ఒక సూక్తిని అనుగ్రహించారు. ఈ కావ్యంలో మాటిమాటికి పలుచోట్ల ప్రాసల ప్రయోగం అందంగా చేయబడినది. తమకు ముందున్న పూర్వాచార్యులు ఏ క్రమంలో అన్ని అనుసరించి పలికారో, ఆక్రమాన్ని అనుసరించి, దేశికులు ఈ గ్రంథాన్ని రచించారు– అని సూక్తిలో వీరు తెలియజేస్తున్నారు. ఇక్కడ, ప్రాచామ్– అని అంటే– ఆత్రేయ రామానుజాచార్యులవారు కావచ్చు, లేక, ఈ సహస్రగీతి ప్రబంధానికి వీరికి ముందున్న ఆచార్యులు రచించిన ఒన్బదినాయిరప్పడి, ఇరుపత్తు నాలాయిరప్పడి మొదలైన గ్రంథాలలోని క్రమాన్ని అనుసరించి నమ్మాళ్వారుల అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తూ సహస్ర గీతికి ఈ నిగమ పరిమళం అనే గ్రంధాన్ని రచించారు–అని కూడా చెప్పవచ్చు. ఇక్కడ" గ్రంథాన్" అనే బహువచనానికి ద్రవిడోపనిషత్ తాత్పర్య రత్నావళి, ద్రవిడోపనిషత్ సారం మొదలైన గ్రంథాలను గ్రహించవచ్చు. వీటిని అన్నిటిని దేశికులు సహస్రగీతి వ్యాఖ్యాన రూపంగా అనుగ్రహించారు –అని కూడా ఇక్కడ భావాన్ని గ్రహించవచ్చు.

వీరికి తరువాత, సమీప కాలంలో 200 సంవత్సరాలకు ముందు అవతరించినవారు, మన్నార్ కోయిల్ అనే దివ్యదేశంలో ఉండే మన్నార్ గుడి రాజగోపాలాచార్యస్వామి అనే ఒక మహాకవి ఉండేవారు. వీరు నావల్ పాక్కం అణ్ణయార్య మహాదేశికన్ కు స్వామికి సమకాలీనులు కావచ్చు. ఈ కవి వారిని స్మరించి నమస్కరించారు. వీరు వేదాంతదేశికుల విషయంగా ఆచార్యసప్తశతి అనే ఒక చక్కని కావ్యాన్ని రచించారు. ఇందులో 700 శ్లోకాలు ఉన్నాయి. ఈ శ్లోకాలు అన్నీ ఆర్యా అనే

వృత్తంలో కూర్చబడ్డాయి. ఈ గ్రంథానికి ఆర్యాసప్తశతి అనే పేరును పెట్టి ఉండవచ్చు. కానీ, ఇంతకుముందే సాహిత్యలోకంలో ఆ పేరుతోనే ఇంకొక గ్రంథం ప్రసిద్ధమై ఉన్న కారణంచేత, వీరు తమ గ్రంథానికి ఆచార్య సప్తశతి అనే పేరును పెట్టారు. ఈ కావ్యంలో వీరు ఒక శ్లోకాన్ని " పర్యచిచింతన్ మాతులకథితాన్ ద్రవిడాగమస్య సారార్థాన్" అని అనుగ్రహించారు. వీరికి క్రియాపదాల ప్రయోగాన్ని విలక్షంగా చేయడం అలవాటు. తమ మేనమామ అయిన ఆత్రేయ రామానుజాచార్య గారు తెలియజేసిన నాలాయిర దివ్యప్రబంధంలోని సారార్థాలను దేశికులు పరిచింతన చేసి, " తేనే బృహతీమ్ వివృతిమ్ స్వయమపరాం నిగమపరిమళాఖ్యాతామ్", ఆ సారార్థాలను పురస్కరించుకొని ఒక పెద్ద వివరణను దేశికులు రచించారు —అని ఈ కవి అంటున్నారు. పెరియప్పంగార్ " అప్పుళ్ళారుడైయ పడిమావాక క్కొండు" అని అన్నందున. ఆత్రేయ రామానుజాచార్యులవారి సూక్తులను ఆధారంగా చేసికొని విస్తరించారు. —అని ఇక్కడ స్పష్టమవుతున్నది.

ఈ విధంగా నిగమపరిమళమనే గ్రంథం ఈ నాడు మనకు లుప్తమైపోయినప్పటికీ కూడా, అందులో ఉండే విషయయాలు ఏ రీతిలో ఉండి ఉంటాయి అనే సంగతిని ఇతర గ్రంథాల ఆధారంగా కొంతవరకు మనం గ్రహించే అవకాశం ఉన్నది.

ఇంక, ఇప్పుడు, నిగమ పరిమళం అనే నామాన్ని గురించి కొంచెం ప్రస్తావింపబడుతున్నది. ఈ నామంలోని తాత్పర్యం కొంత మందికి అర్థం కాకపోవచ్చు. సామాన్యంగా ఇతరులు ఎవరూకూడా వేదానికి సువాసన ఉన్నట్లు చెప్పడం లేదు. చెప్పినప్పటికీ అది సరి పోదు —అని కూడా వారి భావన. వేదం శబ్దరూపమైనది. ఆ విధంగా శబ్దరూపమైన వేదానికి పరిమళం ఉండడం అంటే ఏమి? తార్కికులు అయితే, శబ్దానికి గంధం ఉన్నది అంటే, ఒప్పుకోరుకదా. "తత్ర గంధవతీ పృథివీ" అని పృథివికే గంధం ఉన్నదని వారు అంటారు. వేదం పార్థివమైన వస్తువు కాదు. కనుక, వేదానికి గంధం ఉండే అవకాశమే లేదు. అందుచేత, నిగమ పరిమళం అనే పదమే సరి కాదు. వేదానికి

పరిమళం ఉండే అవకాశం లేనే లేదు— అని పలువురు భావిస్తారు విశేషశాస్త్రజ్ఞులు కూడా ఆ విధంగానే అంటారు. దేశికులు కవి కనుక, కవులు శాస్త్రనియమాలను దాటే అలవాటు ఉన్నది కనుక, వారు వేదానికి పరిమళం ఉన్నదని అన్నారు, అంతే —అని భావించవచ్చు.

అయితే, ఇక్కడ ఒక విషయం మనం గమనించాలి. వేదాంతదేశికులకు వేదానికి పరిమళం ఉన్నదని పలుకడం బాగా అలవాటు. ఆ విధంగా పలుకడం వారికి చాలా ఇష్టం కూడా. ఈ విధంగా వారు పలికిన సందర్భాలు చాలా కనిపిస్తాయి. ఉదాహరణకు— భగవద్ధ్యాన సోపానం అనే స్తోత్రంలో శ్రీరంగనాథుని శ్రీ చరణాలను వర్ణిస్తూ వారు " వేలాతీత శ్రుతి పరిమళం వేధసాం మౌలిసేవ్యమ్" అని అన్నారు. వేద పరిమళం కదా ఆ శ్రీ రంగనాథుని శ్రీ చరణాలలో ఉన్నది. శ్రుతిపరిమళం ఆ స్వామి చరణాలలో గుబాళిస్తున్నది— అని ఇందులో అంటున్నారు. ఇక్కడ కొంత మంది వినోదంగా ఏమన్నారంటే, లేదు, లేదు, శ్రీరంగనాథుని పాదాలలో వేదం నిలచి ఉన్నది. ఆ పాదాల పరిమళమే వేదంలో పరిమళిస్తున్నది, పాదాల పరిమళమే వేదాలకు సోకింది— అని అన్నారు. ఇక్కడ ఏ విధంగా అయితేనేమి? వేదాల పరిమళం పాదాలకు సోకితే ఏమి? పాదాలకే పరిమళం ఉన్నందున, అది వేదాలలో సోకితే ఏమి? ఏమైనా, ఏ విధంగా అయినా, వేదాలకు పరిమళం ఉన్నది కదా. ఇంకా కొంత మంది ఏమన్నారంటే, వేదాలు "యస్య నిఃశ్వసితం వేదాః" అనే విధంగా భగవంతుని నిఃశ్వాస రూపాలు కనుక, భగవంతుని నిఃశ్వాసాలకు సహజంగానే ఒక పరిమళం ఉంటుంది కనుక, ఆ సువాసన వేదాలకు సోకింది— అని అంటున్నారు., దేశికులు— అని అన్నారు. భాగవతంలో కూడా "శ్రుతివాతనీతాః గంధాః " అని వేదాలకు పరిమళం ఉన్నట్లు తెలిపే ఒక సూక్తి ఉన్నది. ఉపచార ప్రక్రియలో వేదానికి గంధం ఉన్నట్లు వేదమే తెలుపుతున్నది. " యథా వృక్షస్య సంపుష్పితస్య దూరాత్ గంధో వాతి, ఏవం పుణ్యస్య కర్మణో దూరాత్ గంధో వాతి" అని పుణ్యం చేసినవారికి అందరికీ ఒక గంధం ఉన్నదని అంటూ ఉపచార ప్రక్రియలో పలుకుతున్నది. ఇక్కడ వాసన అంటే— పరిమళం అని అర్థం కాదు.

గౌణరీతిలో వాసన అంటే –వాసన చేసే కార్యాన్ని చేస్తున్నదని అర్థం. వాసన ఏమి కార్యాన్ని చేస్తున్నది? మల్లె పువ్వుకు సువాసన ఉన్నది. అంటే, దాని వాసన చాలా దూరంలో ఉండే వారికి కూడా మల్లెపూవు మహిమను తెలియజేస్తుంది. ఆ విధంగానే, వేదానికి పరిమళం ఉండడం అంటే, తనకు కల మహిమను ఇతరులకు తెలియజే స్వభావాన్ని అది కలిగి ఉన్నది– అని అర్థం. అందుచేత, తమకు గల మహిమను ప్రకటించే స్వభావాన్ని కల వస్తువులకు పరిమళం ఉన్నదని చెప్పవచ్చు. ఈ విధంగా నిగమపరిమళం అంటే, నిగమంయొక్క మహిమను ఇతరులకు తెలియజేసే స్వభావం– అని ఇక్కడ అర్థం. పరిమళం అంటే మహిమను తెలియజేసే స్వభావం. ఆ విధంగా వేదం యొక్క మహిమను తెలియజేసే గ్రంథం కనుక ఈ పేరు సార్థకమైనది.

వేదాంతదేశికుల "వేలాతీత శ్రుతిపరిమళమ్" అనే సూక్తిలో ఒక చమత్కారం ఉన్నది. సహజంగా వేదానికి వేల ఉన్నద, అంటే,. నియమం ఉన్నది. ఎందుకంటే, అందరూ దానిని నేర్చుకోనే అవకాశం లేదు. ఒక విధమైన అధికారాన్ని కలవారే వేదాన్ని అధ్యయనం చేయడానికి తగిన అర్హతను కలవారు. ఉపనయనం చేసుకొన్నవాడే, అందులోనూ, త్రైవర్ణికుడు అయితేనే, వేదాన్ని అధ్యయనం చేయడానికి యోగ్యతను కలవాడు అవుతాడు. ఇవన్నీ వేదానికి కల వేలలు, అంటే, అవధులు. ఈ నియమాలను దాటి ఉండే ఒక వేదం ఉన్నది. దానిని అందరూ అభ్యసించవచ్చు. స్త్రీలు, పురుషులు, ఈ జాతివారు, ఆ జాతివారు– అనే ఏ విధమైన భేదం లేకుండా అందరూ అభ్యసించవచ్చు. ఆ వేదమే ద్రావిడవేదం. నమ్మాళ్వారుల తిరువాయ్ మొ*ழி* ప్రబంధం. అందుచేత, వేలాతీతశ్రుతి అనేది ద్రావిడశ్రుతి. ఆ ద్రావిడశ్రుతిలోని పరిమళం భగవంతుని పాదాలలో ఉన్నది. ఏ విధంగా? అంటే, ఆ స్వామి పాదాలలోనే కదా శఠారి ఉన్నది. ఆ శఠారి పరిమళం, వేలాతీత శ్రుతి అయిన తిరువాయ్ మొ*ழி* ప్రబంధం యొక్క సువాసనను కలిగి ఉన్నది. ఆ పాదాలను బ్రహ్మలు అందరూ సేవిస్తున్నారు. బ్రహ్మలు సేవించేటప్పుడు, ఒక్కొక్క బ్రహ్మకు ఉండే నాలుగు ముఖాలతో నాలుగు దిక్కులలో వేదాలను అధ్యయనం చేస్తూనే నమస్కరిస్తారు. ఆ విధంగా పలువురు

బ్రహ్మలు వచ్చి, భగవంతుని పాదాలకు నమస్కరిస్తే, ఆ వేదాల పరిమళం భగవంతుని పాదాలకు సోకుతుందికదా.

గోపాలవింశతి అనే స్తోత్రంలో వేదాంతదేశికులు శ్రీకృష్ణుని వర్ణిస్తూ "ఆమ్నాయగంధి రుదితం స్ఫురితాధరోష్ఠమ్" అని శ్రీకృష్ణుని ముఖంలో వేదాల పరిమళం గుబాళిస్తున్నది, బాలకృష్ణుడు ఏడ్చేటప్పుడు అతని స్ఫురించే అధరాలలో వేదాల పరిమళం పరిమళిస్తున్నది – అని అన్నారు. గోదాస్తుతిలో కూడా "ఆమోదితోఽపి నిగమైః విభు రంఘ్రియుగ్మే" అని వేదాలకు పరిమళం ఉన్నదని, ఆ వేదాలు శ్రీరంగంనాథుని పాదాలలో ఉన్నందున, ఆ పాదాలు పరిమళిస్తున్నవి అని అన్నారు. ఈ విధంగా ఇంకా పలుచోట్ల దేశికులు వేదాల పరిమళాన్ని ప్రస్తావించారు. పాదుకాసహస్రంలో " నిగమ పరిమళం" అనే ఇదే పదాన్ని "నిగమపరిమళై స్తే ర్వాసనా వాసయంతీవ దేవా" అని ప్రయోగించారు. యాదవాభ్యుదదయం మహాకావ్యంలో కూడా, రుక్మిణీదేవి, సత్యభామాదేవి శ్రీకృష్ణుని పాదాలకు సంవాహనం చేసేటప్పుడు, ఆ పాదాలలో పరిమళించే వేదాల పరిమళాన్ని గమనించి, "వేదాల పరిమళం వీటిలో గుబాళిస్తున్నదే!" అని తమ చేతులలో ఉండే లీలారవిందాలను కూడా వదిలి పెట్టారు –అని అంటారు.

ఈ విధంగా వేదాల పరిమళాన్ని గూర్చి దేశికులు మాటిమాటికి పలికినందున, నిగమపరిమళం అనే పదాన్ని మాటిమాటికి ప్రయోగించినందున, ఈ పదాన్ని తమ సహస్రగీతివ్యాఖ్యానానికి పేరుగా దేశికులు పెట్టి, ఆత్రేయ రామానుజాచార్యుల వారు తమకు అనుగ్రహించిన సారార్ధాలను అన్నిటిని ఆ గ్రంథంలో కూర్చి, నిగమ పరిమళం అనే గ్రంథాన్ని రచించారు –అని తెలుస్తున్నది. నిగమానికి పరిమళం అనేది ఏ విధంగా పొసగుతుంది? అనే విషయాన్ని ఇంతవరకు కొంచెం చూచాము.

వాస్తవంలో కూడా వేదానికి పరిమళం ఉంటుంది– అని దేశికుల అభిప్రాయం. ఏ స్థితిలో, ఎకెడ మనం ఉన్నామో, ఆ స్థితిలో, అక్కడ ఉండే సంస్కారం అనేది మాటలలో కూడా వ్యక్తం అవుతుంది– అనేది కూడా దేశికుల అభిప్రాయం. ఉదాహరణగా, తమకు ఆచార్యులైన ఆత్రేయ రామానుజాచార్యులవారి వల్ల తమకు లభించిన సంస్కారం తమ మాటలలో పరిమళిస్తున్నది– అని వారు అంటారు. తమ మాటలలో పరిమళం ఏ విధంగా వస్తున్నది? అంటే, అది మడప్పళ్ళినుండి వచ్చిన సంస్కారం, పరిమళం. అది ఏ విధంగా వచ్చింది? అంటే, భగవద్రామానుజులకు మడప్పళ్ళి కైంకర్యం చేసిన, కిడాంబి ఆచ్చాన్ అనే, ప్రణతార్తిహరాచార్యులవారు అని ప్రసిద్ధి చెందిన, తమ మేనమామ అయిన, ఆత్రేయ రామానుజాచార్యులవారి మూలంగా రహస్య సంప్రదాయం తమకు లభించినందున, ఆ సంప్రదాయ రహస్యపరిమళం తమ సూక్తులలో పరిమళిస్తున్నది, వంటశాలకు పోతే, అక్కడ పరిమళం వస్తున్నదని నమ్ముతున్నాము కదా, ఆ విధంగా, వంటశాలనుండే ఇవి కూడా వచ్చాయి, "యతివరమడప్పళ్ళినార్ వంద మణమ్ ఎంగళ్ వార్తైయుళ్ మన్నియదే"– శ్రీరామానుజుల వంటశాలలో కైంకర్యం చేసిన ఆత్రేయ రామానుజాచార్యులవారి వల్ల లభించిన రహస్య సంప్రదాయ సంస్కారం నా మాటలలో స్థిరంగా ఉంటుంది. ఈ రీతిలో నా మాటలలో పరిమళం గుబాళిస్తుంది– అని దేశికులు అన్నారు.

సూక్తుల పరిమళాన్ని గూర్చి వారు మాటిమాటికి ప్రస్తావించడం కనిపిస్తుంది. "తన్నాభినాళీకినీ నాళీకస్పృహణీయ సౌరభముచా వాచా న యాచామహే " అని అంటూ రహస్యత్రయ సారంలో తమ మాటలకు ఒక భగవంతుని నాభికమలంనుండి పుట్టిన వేదం యొక్క సౌరభం ఉన్నట్లు, అల్పులయిన మానవుల దగ్గర అటువంటి సువాసన కలిగిన, గొప్పవి అయిన తమ మాటలతో అల్పమైన సంపద కోసం నీచ మానవుల దగ్గర యాచించనని అన్నారు. ఇదే విధంగా వైరాగ్య పంచకంలో కూడా తమ వాక్కులకు ఒక పరిమళం ఉన్నది అని అంటూ, "వాచా న యాచామహే" అనే ఇదే ప్రయోగాన్ని చేశారు.

ఈ విధంగా వాక్కు పరిమళం ఉన్నదని దేశికులు మాటిమాటికి అంటారు ఆ రీతిలో కూడా ఇక్కడ నిగమానికి ఒక విధమైన పరిమళం ఉన్నది, అది భగవంతుని నాభీకమలంనుండి వచ్చినది కావచ్చు భగవంతుని నిఃశ్వాసాల వల్ల ఏర్పడినది కావచ్చు, భగవంతుని ప్రాధారవిందాలను ఆశ్రయించినందున కలిగినది కావచ్చు, ఇన్ని శతాబ్దుల కాలంగా కొనసాగుతూ వచ్చిన ఈ పరిమళాన్ని కంటే, ఒక పరిమళం తిరువాయ్ మొழி వల్ల వేదానికి ఏర్పడింది. తిరువాయ్ మొழி ప్రబంధంలో వకుళాభరణులు అయిన నమ్మాళ్వారులు ఆభరణంగా ధరించిన వకుళపుష్పాల సువాసన ఉన్నది. –అని అంటారు, దేశికులు. పాదుకా సహస్రంలో" వర్ణస్తోమైః వకుళసుమనోవాసనా ముద్వహంతీ" అనే సూక్తిలో. నమ్మాళ్వారులు అవతరించే వరకు ఆ సువాసన వేదానికి సోకలేదు. ఈ వకుళ పుష్పాల సువాసన ఇప్పుడు వేదంలో పరిమళిస్తున్నది. ఎందుకంటే, వేదం తిరువాయ్ మొழிప్రబంధ రూపంగా వకుళాభరణులైన నమ్మాళ్వార్ల ద్వారా అవతరించింది కదా. అందుచేత, వకుళ పుష్పాల సువాసన ఆ ప్రబంధంలో మరింతగా, మరింతగా పరిమళిస్తున్నది. ఆది నిగమపరిమళం అనే గ్రంథంగా అవతరించింది. వేదం, ఆ వేదాన్ని అనుసరించిన తిరువాయ్ మొழி ప్రబంధం, దానిని అనుసరించిన ఆరాయిరప్పడి ప్రబంధం, నిగమ పరిమళ ప్రబంధంగా దేశికులవారి ద్వారా రూపొందాయి– అని మనం గ్రహించాలి.

